

# జన్మభూమి

(సాంఘిక నాటకం)



రచయిత

శ్రీ కాజా రాధాకృష్ణశాస్త్రి



పబ్లిషర్సు

పల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# శ్రీ మహాభారతము: వచనము

సంట్రి లక్ష్మీనారాయణశాస్త్రి ప్రణీతము

18 పర్వములు — 16 సంపుటములు

| | | | | |
|---|---|---|---|---|
| ఆదిపర్వము | | 4 | 0 | 0 |
| సభాపర్వము | | 1 | 0 | 0 |
| అరణ్యపర్వము | 1 వ భాగము | 3 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 3 | 0 | 0 |
| విరాటపర్వము | | 2 | 8 | 0 |
| ఉద్యోగపర్వము | | 3 | 0 | 0 |
| భీష్మపర్వము | | 3 | 0 | 0 |
| ద్రోణపర్వము | | 3 | 0 | 0 |
| కర్ణపర్వము | | 2 | 0 | 0 |
| శల్యపర్వము | | 1 | 8 | 0 |
| సౌప్తికపర్వము | | 0 | 12 | 0 |
| స్త్రీపర్వము | | 0 | 8 | 0 |
| శాంతిపర్వము | | 4 | 8 | 0 |
| ఆనుశాసనికపర్వము | | 3 | 0 | 0 |
| అశ్వమేధపర్వము | | 1 | 8 | 0 |
| ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | | 1 | 4 | 0 |

పూర్తిసెట్టు వెల 37—8—0

దొరకు చోటు :—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# జన్మభూమి

(సాంఘిక నాటకం)

రచయిత

శ్రీ కాజా రాధాకృష్ణశాస్త్రి



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమంద్రి

# ముఖ్యపాత్రలు

| | |
|---|---|
| రామ్<br>రహీమ్ | (మిత్రులు) |
| నారాయణ | (రామ్ కొడుకు) |
| అహమ్మద్ | (రహీమ్ కొడుకు) |
| భారతి | (నారాయణ భార్య) |
| అలీ | (సేవకుడు) |
| జోసఫ్ | (విలన్) |

# హెచ్చరిక

ఈ "జన్మభూమి" నాటకముయొక్క కాపీ రైటు సర్వహక్కులు మాకు చెందియున్నవి. కావున మా వ్రాతపూర్వకమైన పర్మిషనులేనిదే యేసంఘము గాని, యే సినీమా నటులుగాని, ప్రదర్శింపరాదు. మఱియు గ్రామ ఫోను రికార్డింగు, ఇతర భాషలలోనికి తర్జుమాలు వగైరా చేయకూడదు. అట్లు అతిక్రమించినవారలు మేము జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని యిందుమూల ముగా తెలియజేయడమైనది.

ఇట్లు కాపీరైటు హక్కుదారులు,

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

# కా ని క

౧

కులమత భేద భావములకుం గురియై, బలియై విదేశజా
తుల కపటప్రవృత్తికి, 'జితోస్మి' యటంచు సదాచరించుపు
త్రుల గని, గుండె బ్రద్దలయి రోదనముం బొనరించు భారతీ
జలజదళాక్షికిన్ ముద మొసంగు రసజ్ఞున కిద్ది కాన్కయా.

౨

పేదరికంపుసొంపనుభవించిన దెందము నర్థికోటికిన్
వేదికగా నొనర్చితివి, విజ్ఞుల దన్పుట ధర్మవృత్తిగా
మోదమునన్ గ్రహించితివి, యున్న నవాబులయింట కన్నెము
త్తైదువుగా చరించిన యశోంగనకుం బతివైతి వీ వహో!

౩

హైందవ ధర్మసూత్రముల యం దనురక్తి, నిజాన్వవాయమం
దెందును లేని భక్తి, ధరణీంద్రుల కేని లభింపబోని యా
నందము నందుశక్తి గల నాధుని నిన్ గ్రహియించి నాడు కా
వ్యేందిర పొందు సద్యశ మహీనము నశ్వరమున్ ధరాస్థలిన్.

౪

నా నవ కావ్య నందిని గొనం దగు భూధవు లెందరో తెలం
గాణమునం గలా రయిన గాదని వారల తా వరించె, వి
జ్ఞాని, రసజ్ఞు డిద్ధగుణ సాంద్రుడు నాంధ్రకవీరునున్ మునస
ల్మానుల బెద్ద యైన నిను; మాన్యుడవైతివి నూరుదీన్ దొరా!

# జన్మభూమి



## నాంది

రామచంద్రా! యటన్న; నల్లా! యటన్న;
క్రీస్తుదేవా! యటన్న; నాశ్రితుల రక్తి
గొంగు బంగారమైె తన్పు గుణనిధాన
మా మహాజ్యోతి మిమ్ముల నోముసతము.

## ఒకటో రంగం

[రామూ రహీములు కొలిమిలో పనిచేస్తూ ఉంటారు. రహీం బాగా కాలిన యినుపచువ్వను పట్టుకుని కూర్చుంటాడు. రామూ దాన్ని సుత్తితో మోదుతూ సాగతీస్తూ ఉంటాడు.]

భారతి ఒకవంక రాట్నంమీద దారం తీస్తూ ఉంటుంది.

రామ్—(కొడలివైపు చూస్తూ) అమ్మా...భారతీ!

భారతి—(అటుగా చూసి)...ఆ...పిలిచారా!

రామ్—చూడు...నిన్న చదివిన శ్లోకం...

రహీమ్—(చిరునవ్వుతో) భారతి నిజంగా భారతేనోయ్...
భాయీ!

(భారతీ రాముల మందహాసం)

భారతి—(శ్లోకం)

"యథా సుదీప్తా త్పావకా ద్విస్ఫులింగా
స్సహస్రశః ప్రభవ న్తే స్వరూపాః
తథాఽక్షరా ద్వివిధా స్సోమ్యభావాః
ప్రజాయ న్తే తత్ర చైవాపి య న్తి"

రామ్—(ఉత్సాహంతో) విన్నావా భాయీ...! ఎందుకనో గాని యీ నిప్పురవలను చూడగానే నా కా శ్లోకం స్ఫురణకు వస్తుంది. (భారతితో) అమ్మా...దాని అర్థంకూడా...

భారతి—మండుతూన్న అగ్నిలోంచి దానితో సమాన రూపంగల నిప్పురవలు యేవిధంగాపుడుతున్నాయో అలాగేనాశనరహిత మైన పరమాత్మలోనుంచి వివిధములైన జీవులూ ఉద్భ విస్తున్నాయి అని.

రహీమ్—(ఆనందంతో) సెబాస్ రాణీ...సెబాస్...! ఏదీ... ఆఁ...! పరమాత్మ అంటే యేమన్నావూ...!

భారతి—(శ్లోకం)

"యతోవా యిమాని భూతాని జాయ న్తే
యేన జాతాని జీవ న్తి
యత్ప్రయ న్త్యభి సం విశంతి
తద్విజిజ్ఞాస స్వ తద్బ్రహ్మేతి" అన్నారు.

అంటే..., ఈ భూతాలన్నీ దేనినుండి పుడుతున్నాయో, దేనివలన
జీవిస్తున్నాయో, లయాన్ని పొంది దేనిలో ప్రవేశిస్తు
న్నాయో అదే పరబ్రహ్మమూ అని.

రహీమ్—శేష్...! నిజంగా నువ్వు భారతివే నమ్మా!

[ దివాణంలో 6 గంటలు కొడతారు. అది రహీమ్ వింటాడు, చేతులో బద్దను ఓ ప్రక్కగా వదలి "నమాజ్"కు ప్రక్కగా తొలుగుతాడు.

రాముకూడా చేతిలోని పనిముట్లు నావలపెట్టి భారతివంక చూస్తూ ఉంటాడు. ]

రామ్—...అమ్మా—కాసిని నీళ్ళు...
భారతి—(లేచి)...ఇస్తున్నానండీ...!

[ భారతి లోపలకు వెళ్ళి నీరు తీసుకువస్తుంది. రాముకు అందిస్తుంది; తుండు పట్టుకుని నిలబడుతుంది.

రాము కాళ్ళూ మొగమూ కడుక్కుని, కూర్చుని మౌనంగా ప్రార్థన కుపక్రమిస్తాడు.

[భారతి లోపలకు వెడుతుంది. ]

రహీమ్—(లేచి)...రాణీ!

భారతి—(లోపలనుంచే)...వస్తున్నాను చాచా...!

[ అంతలో జోసఫ్ ప్రవేశిస్తాడు, సూటూ, హ్యాటూ, బూటూ ధరించిఉంటాడు, సిగరెట్ పీలుస్తూ ఉంటాడు. భావాలన్నీ ఏదో లోకంలోనో విహరిస్తున్నట్లుగా అగుపిస్తాడు. ]

జోసఫ్—(ప్రవేశిస్తూ)...హల్లో...! గుడ్ మార్నింగ్ కాకాజీ...!

రహీమ్—(చురచురచూస్తూ) బేటా...! రామూకాకా ప్రార్థన చేసుకుంటున్నాడు; కనబడటం లేదూ...!

జోసఫ్—(సిగరెట్ క్రిందపడేసి, బూటుతో నలుపుతూ)...ఎక్స్ క్యూజ్ మీ కాకాజీ...! యేదో ఆలోచనలో ఉండి యిది మరచాను. (ఏదో స్ఫురణకు వచ్చినట్టుగా ఆఁ...!అయినా ...ఒకరి ప్రార్థనకూ మరొకరిఁ స్మోకింగు కూ యేమిటి సంబంధం కాకాజీ!

రహీమ్—జోసఫ్ బేటా...! నీకు యింకా యెలా బోధించాలో నాకు తెలియటంలేదు. అస లిది పవిత్రస్థలం. అదీ రెండు విధాలుగా చూడవచ్చు. ఇక్కడ శ్రమించిన జీవులు హాయిగా సక్రమ మార్గంలో జీవితం గడుపుకో గలుగు తున్నారు. రెండోది యిక్కడనే నేనూ రామూ కాకా ప్రార్థనలు చేసుకుంటాం. అదే మాకు తెలిసిన విషయం. విన్నావా...! పవిత్ర స్థలంలో అపవిత్ర కార్యాలు జరగ రాదని మన పెద్దలు చెప్పారు. అంతే...!

జోసఫ్—(చిరునవ్వుతో) అది గుడ్డినమ్మకం; కాకాజీ...! దాన్నే మాబోటి నాగరికులు "బ్లైండ్ బిలీఫ్" అంటారు.

[ భారతి రెండు కప్పులతో "టీ" తీసుకువస్తుంది. మామ గారి ప్రార్థన కాలేదే అనీ, అదీగాక జోసఫ్ అక్కడ ఉన్నాడే అనీ శంకిస్తూ ఒక అడుగు వెనకకు వేస్తుంది. ]

హల్లో...వదినా...గుడ్ మార్నింగ్! కమాన్...!
భిడియ పడతారేం...(ముందుకు రెండడుగులు వేస్తాడు)

రహీమ్—బేటా...నీ కెన్నిసార్లో చెప్పాను; వదినగారితో పరిహాసం పనికిరాదని.

జోసఫ్—(చిన్నబుచ్చుకొని) ఎక్స్‌క్యూజ్‌మీ ... కాకాజీ ... అయినా "సోషల్"గా ఉండటంలో తప్పేముంది...?

రహీమ్—(తీవ్రంగా) జోసఫ్...! నీ తల కెక్కిన ఉన్మాదం నాలు కనుకూడా పాడుచేసింది. చూడు ... ముందుగా ఆ సిగ రెట్టును...

జోసఫ్:—ఓ! ఎక్స్‌క్యూజ్‌మీ కాకాజీ...! (అలాగే చేస్తాడు) అయినా...

రహీమ్—...రాణీ...!

(జోసఫ్ లోపలకు చూస్తాడు)

భారతి—ఏమిటి చాచా...!

రహీమ్—"చా"తయా రయింది కదూ...!

జోసఫ్—(సంతోషంతో)...థాంక్యూ...థాంక్యూ...కాకాజీ...!

(రహీమ్ చురచుర చూస్తాడు)

భారతి—ఇక్కడ పెట్టాను చాచా...!

రహీమ్—(తనలో) దేవత వమ్మా నువ్వు! (కఱ్ఱ సహాయంతో లేచి లోపలకు వెడతాడు)

రామ్—(నిమీలిత లోచనాలతో)

"శ్రీమద్భాను సహస్రమండల విభాసీ!
సచ్చిదానందమూర్తీ!
మాయా పరికల్పితాఖిల జగచ్ఛ్రేణీ!
దయాంభోనిధీ!

స్వామీ! నీ మహిమంబు లా నిగమముల్
మన్నింప లేవన్నచో
నే మూఢాత్ముఁడ నేమెఱుంగుదును ?
తండ్రీ! భక్తచింతామణీ!''

(కన్నులు తెరచి యెదురుగా జోసఫ్‌ను చూస్తాడు. చూపులతో పలకరిస్తాడు.)

జోసఫ్—థాంక్యూ...థాంక్యూ...కాకాజీ!... నేనే మిష్టర్ జోసఫ్‌ను.

రహీమ్—('టీ కెటిల్'తోనూ, మూడు కప్పులతోనూ ప్రవేశిస్తాడు. వచ్చి కూర్చొని కప్పులలో 'టీ' పొయ్యబోతూఉంటాడు. ఒక కప్పు నింపి)...రామూ భయ్యాం...!(అందిస్తాడు)

రామ్—(అందుకుని జోసఫ్‌తో) ఎప్పుడు వచ్చావు నాయనా...!

జోసఫ్—నిన్న బయుద్దేరి యివ్వాళే వచ్చాను కాకాజీ! చాలా 'టీ డియస్ జర్నీ' అయింది. కాకపోతే సెకండ్ క్లాసులోనే పడుకున్నాననుకో...
(రహీమ్ ఒక కప్పును అతనికూడా అందిస్తాడు)
థాంక్యూ...థాంక్యూ...

రామ్—ఇంతకూ ఎక్కడ ఉంటున్నావు... ?

జోసఫ్—(ఆలోచనలో ఉన్నట్లు) ఆఁ...ఏమన్నావు కాకా... ఓ...ఎక్కడఉంటున్నావనా...! ఒకచోటేమిటి...పదిపన్నుంటాయి. ఇవ్వాళ యిక్కడ ఉన్నానా...సాయంత్రానికి కలకత్తా వెడతాను. రేపు ఉదయానికి వెంటనే బొంబాయికి వెళ్ళిపడతాను...రేపు సాయంత్రానికి మద్రాసో... చూమో...ఏమని చెప్పను.

రామ్—(కొద్దిగా కష్టపెట్టుకుని) ... ఏ పనిమీద తిరుగుతున్నట్లు,?

జోసఫ్—నాబోటి 'జంటిల్ మెన్'కి ఒకపని అనిఉండదు. కాకా...! అందరికీ మాతో ఏవో పది పనులుంటూనే ఉంటాయి. (సిగరెట్ వెలిగించబోయి రహీమ్ ను చూచి) 'ఎక్స్‌క్యూజ్ మీ'...! (దాన్ని దాచి)... అయినా కాకా...నారాయణ్ భాయీ...

రామ్—ఈపాటికి వస్తావుంటారు నాయనా...నిన్ననే ఉత్తరం వచ్చింది.

జోసఫ్—ఓం...! థాంక్యూ థాంక్యూ!! గుడ్ న్యూస్ చెప్పావు కాకా...రహీమ్‌చాచా ఆ మాటే యెత్తలేదు.

రహీమ్—నువ్వు నన్ను అడగనేలేదు బేటా...! మరచిపోయి ఉంటావు.

జోసఫ్—ఓ...థాంక్యూ థాంక్యూ...కాకాజీ !

[అంతలో నారాయణ అహమ్మదులు ప్రవేశిస్తారు. రాగానే నారాయణ తండ్రికి నమస్కరిస్తాడు. మహమ్మద్ తండ్రిని కౌగిలించుకొంటాడు. వృద్ధులు మౌనంగా బిడ్డలను దీవిస్తారు.]

[జోసఫ్ ఆశ్చర్యంగా వారివంక చూస్తూనిలబడతాడు. అనంతరం వారు జోసఫ్‌ను పలకరిస్తారు]

జోసఫ్—(చేయి అందిస్తూ)...థాంక్యూ... థాంక్యూ...గుడ్ మార్నింగ్...!

నారా—కాకా...! మీ కోడలు పిల్ల యెక్కడ తపస్సు చేస్తోంది,?

(అందరూ నవ్వుకుంటారు. జోసఫ్ బిగ్గరగా నవ్వుతాడు)

రహీమ్—(మందహాసంతో) లోపల ఉంది బేటా...!

జోసఫ్—(నారాయణతో) నువ్వెంత "సివిలైజ్డు" అయినా ఆవిడ మాత్రం...

రహీమ్—జోసఫ్...! (గద్దిస్తాడు)

జోసఫ్—ఎక్స్‌క్యూజ్ మీ... కాకాజీ...!

రహీమ్—...రాణీ...!

భారతి—ఆc...వస్తున్నాను చాచా! (అందరూ నవ్వుకుంటారుc నారాయణ చిరునవ్వు. భారతి వచ్చి ఓరగా చూస్తూ తలుపు పక్క నిలబడుతుంది; రెండు కప్పుల 'చా'తో)

అహమ్మద్—సలామ్...వదినా...!

(భారతి చిరునవ్వు)

నారాయణ—(రహీమ్‌తో) కోడలు పిల్ల మూగనోము పట్టిందా కాకా! (వెళ్ళి ఆ కప్పులు అందుకుంటాడు. అందరూ నవ్వు కుంటారు, ప్రక్కన ఉన్న కప్పులవంక చూసి) మీరు తీసు కున్నట్లున్నారే!

(జోసఫ్)...నువ్వు యెక్కడవుంటున్నావు? ఎప్పుడు వచ్చావు!

జోసఫ్—ఇప్పుడే కాకా లకు చెప్పాను. తిరిగి చెప్పాలంటే...

రహీమ్—అంత కష్టపడవద్దు బేటా...నేను చెబుతాలే...!

(భారతి హేళనగా నవ్వుతుంది. జోసఫ్ అది గ్రహించాడు, కష్ట పెట్టుకుంటాడు)

నారా—(ఒక కప్పును అహమ్మద్ కందిస్తూ)...చాచా గ్రామంలో అందరూ కులాసాగా ఉన్నారా...!

రహీమ్—హాc బేటా!

నారా—మీరు పెట్టిన గడువు దాటిందేమో ?

రామ్—దేనికి నాయనా...!

రహీమ్—(ఆలోచించి) ఓ...!అదా...నిజమే...!

నారా—అయితే రేపు...మాతో...

రహీమ్—అప్పుడే యెందుకు బేటా...! మీరు కొద్దిగా కాళ్ళు నిలద్రొక్కుకోవాలా ఒద్దా...!

అహా—అదేం మాట అబ్బా!

రామ్—తొందర పనికిరాదు నాయనా...! అయినా మేమేమంత కష్టపడుతున్నామని...?

జోసఫ్—వదినెను తీసుకువెళ్ళాలని నారాయణ అభిప్రాయంలా వుంది.

(నారాయణ తప్ప అందరూ మందహాసం చేస్తారు)

రామ్—దాని కభ్యంతరమేముంది నాయనా!

అహా—అదెలా జరుగుతుంది కాకా! మీరిక్కడ...

జోసఫ్—అహమ్మద్! అదీ ఒక "ప్రాబ్లమేనా! నువ్వూ పెళ్ళి చేసుకుని ఆ వదినగార్ని యిక్కడ...

(అహమ్మద్ తప్ప అందరూ నవ్వుతారు)

రహీమ్—మా రాణీ మాదిరి కోడలు దొరకటం...

రామ్—(సంతోషంతో)...అదీ అదృష్టమే నంటావు!

రహీమ్—కాదా మరి ?

రామ్—అయితే మా రహీమ్ భాయి కోడలే వస్తే మా కీమాత్రం కూడా పని వుండదేమో...

నారా—(చిలిపిగా) అంటే... ?

రామ్—ఏముంది? ఉదయాన 'చా' యిస్తుంది, హుక్కా అంది స్తుంది, వెంటనే అన్నం పెడుతుంది. తిరిగి హుక్కా... తరువాత పడక...ఫలహారం...'చా'...యిలాగే...

(అందరూ నవ్వుకుంటారు)

రహీమ్—(నారాయణతో) బేటా...మీా కక్కడ కులాసాగా ఉంటోందా!

నారా—ఆ; మీాకు సేవ చేయలేక పోతున్నామే అన్నవిచారం తప్ప...

[ వృద్ధు లిద్దరూ సగర్వంగా ఒకరినొకరు చూచుకుంటారు ]

అహ—(రామూతో) రేపు మిమ్మల్ని తీసుకునే వెళ్ళదలచాం కాకా!

రామ్—దానికేం నాయనా! కాని, పుట్టిపెరిగిన యీాగడ్డ నెలా వదిలిపోవడమూ అని...

జోసఫ్—అదేంమాట కాకా...?

రహీమ్—అది నీకు తెలియదు బేటా; అది నీకు తెలియదు! తరతరాలుగా ఈ మట్టిలో తమ రక్తాన్ని మెదిపి మా తాతలు దీన్ని పండించుకున్నారు. వారికున్న తెలివి తేటలతో యిచ్చుటవున్న పదిమందితోనూ మంచి చేసు కున్నారు. వీలున్నంతగా యితరులకు సాయపడ్డారు. ఈ మా రక్తనాళాల్లో కండరాల్లో, బుఱ్ఱలో యేమాత్రపు శక్తి అయినా ఉన్నదీ అంటే అది యీా మట్టిలోంచి ఉద్భవిం

చిందే బేటా...! చూడు ! అరవై యేళ్ళుగా అనుభవించిన ఆ ఆనందాన్ని యెలా వదిలి ఆవల పడగలమో చెప్పు !

రామ్—భాయీ ! వారి కీ మాటల అర్థం యెలా తెలుస్తుంది ఈ గ్రామాన్ని వదలడానికి మనం పడే బాధ కెలా అర్థమా తుంది ?

జోసఫ్—అన్నయ్యల నవమానిస్తున్నారు కాకాజీ.

రహీమ్—జోసఫ్ ! మా బిడ్డలను మేమే అవమానిస్తే మాతల్లి మ మ్మవమానిస్తుందనే జ్ఞానం మాలో కూడా లే దను కున్నావా !

(భారతి ఫక్కున నవ్వుతుంది. అది శూలంలా జోసఫ్‌కు తగులు తుంది)

జోసఫ్—అంటే...నా కా జ్ఞానం...

రామ్—అది కాదు నాయనా ! అయినా అంతటి ఆవేశం దేనికి ?

అహ—జోసఫ్ భాయ్ ! యేమి టా ఆవేశం ? కళ్ళు తెరవగానే కాళ్ళకు బుద్ధిచెప్పిన మనకు వ్రేళ్ళు పాతుకుపోయిన వీరి అభిమానం యెలా అర్థమౌతుంది ?

నారా—నిజం...నిజం ! అహమ్మద్ భాయీ చెప్పిందంతా నిజం. మనమూ పరసీమల్లో పెరిగాం. పరభావలు మరిగాం. అలాం టప్పుడు ..

రహీమ్—నువ్వు జోసఫ్ భాయితో మాట్లాడుతున్నావు బేటా.

నారా—(ఆగి)...ఔను కాకా...!

రహీంమ్—అతడికి తెలియని విషయాలు చెబుతున్నావు.

(నారాయణ మాట్లాడడు)

జోసఫ్—కాకాజీ! (గద్దిస్తాడు)

రామ్—అంతటి ఆగ్రహం దేనికి నాయనా!

జోసఫ్—'నేకెడ్ యిన్‌సల్టు' (వెళ్ళబోతాడు)

నారా—జోసఫ్...కాకామీదనా యింతకోపం!

రామ్—అయినా రహీంమ్‌భాయ్ అన్నదాంట్లో తప్పే ముంది?

నారా—బాబూ! (వారిస్తాడు)

జోసఫ్! నువ్వేదో పెద్దల మనస్సు కష్టపెట్టి వుంటావు కాక పోతే...

జోసఫ్—'డామ్ యిట్!'

రహీంమ్—లేదు బేటా లేదు. మా చేతుల్లో పెరిగిన వాడు మా మనస్సు కష్టపెట్టాడని యింతగా అనుకోం. కాని, ఉన్న వాతావరణా న్నంతనీ యితడు కలుషితం చేయటం మాత్రం......మా హృదయాన్ని......(కళ్ళు చెమ్మగిలు తాయి)

రామ్—రహీంమ్ భాయ్! ఏమిటీ వెఱ్ఱి!

రహీంమ్—ఇతని తండ్రి—జాన్ భాయీ—తన అవసానకాలంలో యితడ్ని మా చేతుల్లో—పెట్టాడు. అప్పటి కితను ఆరేళ్ళ పసికూన. మీ యిద్దరినీ పెంచినట్టుగానే యితడ్నీ పెంచాము. మా కండరాల పటుత్వం యితడికూడా భాగాన్ని పంచి పెట్టింది. కాని...విధివిలాసం...(కంఠం గాద్గదికత నందు తుంది.)

నారా—(దగ్గరగా వెళ్ళి) కాకా...! ఎందు కింత బాధ? నాటిన విత్తు లన్నీ ఫలిస్తాయా...!

రహీమ్—ఫలించక పోయినా ఫరవాలేదు బేటా! కాని...అవి మారురూపాన్ని పొంది ముళ్ళకంపలై మన చేతులనే చీలుస్తుంటే...

జోసఫ్—మిష్టర్ రహీమ్...! (ఉరిమి చరచరా వెళ్ళిపోతాడు.)

నారా—(గద్దిస్తూ) జోసఫ్...!

అహమ్మద్—వదినా...! ఈ ప్రళయ మంతా యేమిటి?

రహీమ్—రాణీ కేం తెలుస్తుంది బేటా...! అతడి చర్యలు చెప్ప గలది ప్రపంచం.

రామ్—ఔను నాయనా...ఏదో ముసలివాళ్ళం గదా అని అతడింకా మమ్మల్ని...

అహ—ఆఁ...!

నారా—అయితే అత డిక్కడి కెందుకువచ్చినట్లు...?

రహీమ్—బేటా...! ఇదంతా ఒక విచిత్ర చరిత్ర. నీ కిప్పుడు దాని పరిశీలన అనవసరం.

రామ్—ఈ ఆనంద సమయంలో యీ రభస దేనికి భాయీ!

నారా—ఇదంతా నన్ను కలవర పరుస్తోంది కాకా...!

అహ—నారాయణ్ భయ్యాఁ...! మన మా ప్రసంగం మారిస్తే బాగుంటుంది. ఏదీ...మనం తెచ్చిన...(మూట తీసి అందులోంచి భారతమాత పటం తీసి రామూకు అందిస్తాడు. వృద్ధు లిద్దరూ అదిచూసుకుని మురిసిపోతారు.)

రహీమ్—...రాణీ...!

భారతి—ఏమిటి చాచాజీ !

రహీమ్—ఏదీ...నువ్వుపాడే...

భారతి—(పటాన్ని చూసి పరవశురాలై చిలిపిగా భర్తవంక చూస్తుంది)

నారా—ఊఁ...కానీ...!

భారతి—చాచాజీ కూడా దాన్ని బాగా వల్లెవేశారు.

నారా—ఓ...ఇంకానేం!

భారతి—

[పాట]

"జనగణ మన అధినాయకజయ హే భారతభాగ్య విధాతా
పంజాబ్ సింధు గుజరాత్ మరాఠా ద్రావిడఉత్కళవంగా
వింధ్యహిమాచలయమునా గంగా ఉచ్ఛలజలధి తరంగా!
తవ శుభ నామే జాగే తవ శుభ ఆశిషమాగే
గాహే తవ జయగాధా.

జనగణ మంగళదాయక జయహే భారత భాగ్యవిధాతా
జయహే జయహే జయహే జయ జయ జయ జయహే !
అహరహ తవ ఆహ్వాన్ ప్రచారిత సునితవ ఉదారవాణీ
హిందు బౌద్ధ శిఖ్ జైన పారశిక ముసల్మాను కిరస్తానీ
పూరవ పశ్చిమ ఆసే తవ సింహాసన పాశే ప్రేమహార హాయ్
గాధా.

జనగణ ఐక్య విధాయక జయహే భారత భాగ్యవిధాతా
జయహే జయహే జయహే జయజయజయజయహే !

(అందరూ కలసిపాడతారు తెర)

## వీధిలో ఒకమూల

[జోసఫ్ పచారుచేస్తూ ఉంటాడు, అతడిలో క్రోధం ద్యోతక మౌతుంది, చేతిలో రివాల్వర్ ఉంటుంది]

జోసఫ్—డామ్‌యిట్...! వాళ్ళెంత ?...వాళ్ళ శక్తియెంత ? నన్నే ఇన్‌సల్టు చేసింతరువాత వాళ్ళ గౌరవాన్ని నేను స్పేర్ చేయటమా ! నేకెడ్ ఇన్‌సల్టు, టెరిబుల్, మిస్టర్ జోసఫ్ యీ అవమానం కంటె హాంగింగును వెల్‌కం చేస్తాడు, నా 'లౌ' నన్ను హేళనచేసిందన్నా ఐ డోన్‌టు మైండ్, అది నన్ను చెప్పుతీసుకుకొట్టినా ఇట్ యీజ్ నో ఇన్‌సల్టు, కాని, ఆ ఓల్డు ఫూల్సు...టెరిబుల్!...టెరిబుల్ !!

ఏమైనా సరే- నా 'లౌ', 'క్వీన్ ఆఫ్ మైహార్టు' నాయుమ్ బ్రేస్‌లోకి రావలసిందే. నా ఐడియల్ నేనుచేరేవరకూ నాకు రెస్టులేదు, స్లీప్‌లేదు, నా ప్రాణం పోయినాసరే ఆ యట్టెం ప్టులో, ఐడోంట్ లీవ్ దెమ్, ఐనెవర్ లీవ్ దెమ్ !

(టైం చూసుకుని) ఈపాటికి వాళ్ళు రైల్లో యెక్కి ఉంటారు, ఆల్‌రైట్ ! ఉహుం—! యిక్కడే వాళ్ళపని పట్టేవాడ్ని... కాని...విలేజికి విలేజి అంతా ఒక్క 'యూనిట్'గా ఉంది, దట్‌యీజ్ మె న్యూసెన్సు,

ఓల్డు డాగ్సు యిక్కడే ఉన్నారుగా...ఓ కే...!

(నిష్క్రమిస్తాడు,)

---

## రెండో రంగం

[పట్టణంలో నారాయణయిల్లు. అహమ్మదుతో బల్లముందు కూర్చొని నారాయణ పేపరు చూస్తూ ఉంటాడు. ఓ ప్రక్కగా వుండి నిలబడి భారతి 'టీ' కలుపుతూవుంటుంది.]

భారతి—('టీ' కప్పులు వారిముందరగా ఉంచుతూ) ప్రపంచ వ్యవహారాల్లో మునిగి నిత్యకృత్యాలే మరచిపోతున్నారు.

అహ—(చిరునవ్వుతో) భాయీ......! వదినగా రేదో అంటున్నారు...!

భారతి—'టీ' చల్లారిపోతోంది.

నారా—(పేపరు చూడటం చాలించి) టీ టీ...టీ...ఎంత సేపు విన్నా 'టీ' గొడవే. అబ్బబ్బా......ఈ 'టీ' మాదిరే మన రక్తంకూడా చల్లారిపోతే దేశం శాంతంగా బ్రతుకుతుంది.

[భారతీ అహమ్మదులు నవ్వుకుంటారు]

వేడిరక్తం చల్లారాలంటే మీకు నవ్వుగా ఉంది. ఆ వేడి అంతులేకుండా మరగిపోయి పరవళ్ళు ద్రొక్కుతూ ఉచ్చ నీచాలు తెలియనీకుండా ఉంటే చివరకు యేడుస్తారు... అంతేనా...!

భార—(చిన్నబుచ్చుకొని) అంతమాట దేనికండీ...!

అహ—అదేమిటి భాయీ......! అయినా అలాంటి మహోపద్రవం యేం కలిగింది ?

నారా—(పత్రిక అహమ్మదుకు అందిస్తూ) ఉపద్రవం కలిగింతరువాత చేయగల దేముంది ? నివారణోపాయం చూచుకోవాలిగాని.

భారతి—మీ ప్రసంగం మాకేమీ అర్థంకావటంలేదు.

నారా—(టీ కొద్దికొద్దిగా తాగుతూ) పల్నాటి యుద్ధానికీ, సర్వనాశనానికీ మూలకారణం కోడిపందెం. బొబ్బిలియుద్ధానికి సామ్రాజ్యవిచ్ఛిత్తికీ కారణభూతమయింది. ......

భారతి —ఇది కళాశాల అనుకుంటున్నారేమో......మనయిల్లే...

(అహమ్మద్ బిగ్గరగా నవ్వుతాడు)

నారా—అహమ్మద్... ! నీ కూడా నా మాటలు నవ్వు తెప్పిస్తున్నాయా...!

భార —(చిలిపిగా) చూస్తూనే ఉన్నారుగా !

నారా—(ఆ పత్రికలో ఒక భాగాన్ని చూపిస్తూ) చూడు...! నువ్వే చదివి వినిపించు.

అహ—(తీవ్రంగా అటేచూస్తూ) ఏమిటిది ? ఆస్తికోసరం అన్నను తమ్ముడు చంపాడా...! సొంత అన్నతమ్ముల మధ్యనా యీ కల్లోలం...?

భారతి—ఏమని ఉంది...? ఏం జరిగింది...?

అహ—తండ్రి ఆస్థిని పంచుకొనే సందర్భంలో...

భారతి—రామ...రామ!

నారా—(భారతితో)...నవ్వావేం...? నవ్వు...! ఊహుఁ...! ఈ కాస్త డబ్బుకే యింతపని జరిగితే ఇక సామ్రాజ్యాలు కల

హించుకున్నాయంటేనూ, అవి ఘోరాతిఘోరమైన దురం తాలు చేసినాయంటేనూ ఆశ్చర్య మేముంది...?

అహ—ఔను. ఆశఅనేదే ఉండకూడదుగాని ఉన్నదా...అదెంత పనినైనా చేయిస్తుంది.

భారతి—ఆ ! తప్పకుండాను.

నారా—మరి దాన్ని మొదట్లోనే నిర్మూలిస్తే...! అదీ నేను విచారించేది.

భార—అంతే...! తరువాత అనుకునిమాత్రం యేమి లాభం ?

నారా—ప్రతి మహాత్కార్యానికీ మూలం అతిసామాన్యంగానే ఉంటుంది.

భార—ఆ...అంతే...!

నారా—పేరాసఅనేది ఉండకూడదు. (ఆలోచనలోఉంటాడు)

భార—నిజమే...!

నారా—నాగరికత అనే పేరుతో అది యీనాటి యువకుల్లో ప్రవేశించే వారికి పిశాచ రూపా న్నిస్తోంది.

అహ—సరైన అధ్యాపకుడు మా నారాయణ భాయి.

పోరా—ఏమంటావు భాయీ ! ముందుగా బాగుకావలసింది విద్యార్థి లోకం. ఔనా !

అహ—తప్పకుండాను.

నారా—నిజంగా మనబోటివాళ్ళం యీ విద్యార్థులనూ ప్రపంచాన్నీ అలా తయారుచెయ్యటానికి శపథం చేయటం మెంతగానో అవసరం.




అహ—ముమ్మాటికీ.

భారతి—శపథం తీసుకోవడంతో [illegible] కాదు. [illegible]నికి తగిన త్యాగశక్తి నలవరచుకోవాలి.

అహ—అహ(మందహాసంతో) వదినగారి హెచ్చరిక అమూల్య మైంది.

(భారతి సగర్వంగా పెదిమ నొక్కుకుంటుంది. అహమద్ మందహాసం చేస్తూ ఆమెవంక ఓరగా చూస్తాడు)



(తెరలో పిలుపు)

వకీలుసాబ్...! వకీల్‌సాబ్...!!

అహ—...అలీ;...!

[సేవకుడు అలీ లోపలినుంచి ప్రవేశిస్తాడు]

వాకిట్లో...యెవరో...

నారా—ఎవరో 'క్లయింట' యి ఉంటాడు. (భారతివంక సార్థకంగా చూస్తాడు. ఆమె మెల్లగా యింట్లోకి వెళుతుంది)

[అలీ ముందుగా ప్రవేశించి భారతి లేదుగదా అని చూసి నూత్నవ్యక్తికి సైగచేస్తాడు; లోనికి రమ్మని]

అలీ—...తమకోసరం (నూతన వ్యక్తివంక చూపుతూ లోనికి వెడతాడు.)

నూ. వ్య—సలాం ఆలేకుం...వకీల్‌సాబ్...!

అహ—ఆలేకుం యస్సలామూ! మన దేగ్రామం భాయీ?

నూ. వ్య—...హిక్డే...హిక్డే...
అహ—ఏం పనిమీద వచ్చారు...?
నూ. వ్య—మాకీ సేట్‌జీ షౌకత్‌హుస్సేన్ మీకీ...(కొన్ని కాగితాలనూ ఒక కవరునూ అందిస్తాడు.)
నారా—...కూర్చోండి...! (కవరును విప్పిచూస్తూ ఉంటాడు.)
నూ. వ్య—ఫర్మాయిసై సాబ్...!
అహ—వా రెప్పుడు వస్తామన్నారు ?
నూ. వ్య—తమరీహుకుం...
అహ—సరే...వారిని రేపు ఉదయానికే—రమ్మన్నామని చెప్పు భాయీ!
నూ. వ్య—(వెనుకకుపోతూ)...—సలామ్...!
అహ—(నారాయణకు ఉత్తరాన్ని అందిస్తూ)...చూడు...!
నారా—(పరిశీలించి) ఊ...!
అహ—(మందహాసంతో) మనకర్తవ్యం...?
నారా—నే నేమని చెప్పేది...?
అహ—ఒక చిన్న సలహాతో...
నారా—ఔను...! అర్థమయింది. పతిక ముప్పదివేలు చేతులో పడతాయి.
అహ—కాని—ఈ కాగితాన్నే—ఉపయోగించి...
నారా—ఆఁ...అదీ నిజమే...! ఒక అమాయకుడైన జమీందారుని కుటుంబాన్ని నిలబెట్టవచ్చు.
అహ—(లోపలకు చూచి)—అలీ! (నారాయణతో) రాజీ కుదురుతుం దేమో చూద్దా మనే సేట్‌జీని రేపు రమ్మన్నాను.

[అలీ : ప్రవేశిస్తాడు]

ఏదీ...''టీ'' తీసుకురా...!

భారతి—(ప్రవేశిస్తూ) ఆలోచనలో పడ్డట్టున్నారే...!

నారా—ఊఁ...!

భారతి—ఇప్పుడే తిరిగి ''టీ'' త్రాగాలిసి వచ్చిందీ అంటే యేదో సుదీర్ఘమయిన ఆలోచనలో పడి ఉండాలి అనుకున్నాను.

అహ—నిజమే వదినా... .....మీ అభిప్రాయం అర్థవంతమైందే!

నారా—(చిరునవ్వుతో) ఒక్క నిర్ణయంతో అహమ్మద్ భాయి ఒక నిధిని పొందటమో, లేదా ప్రపంచదృష్టిలో దేబె కావటమో జరుగుతుంది.

అహ—(బిగ్గరగా నవ్వుతూ) ఆ నిర్ణయాధికారం మీకే వదల దలిచాను వదినా!

భారతి—అదెంతమాట...? నేనా అటువంటి నిర్ణయం చేయగల దాన్ని? మహాత్ములు పరిష్కరించాల్సిన సమస్య అది.

నారా—(అత్యుత్సాహంతో) అయితే నీ మరదిని కూడా ఒక మహాత్ముడిని చేయదలచావన్న మాట.

భారతి—(చిలిపిగా) మహాత్ములు చేస్తే కారండీ...ఆ గుణం...

అహ—నన్నొక వెట్టివెంకటాయను చేస్తున్నారు వదినగారు.

భార—(చిలిపిగా) అయితే నే నసలే మాట్లాడను.

అహ—కాదువదినా—ఊరికే అన్నాను. అయినా అసలు విషయమేమిటో...

భార—ఆ మాత్రం అర్థం కాకపోలేదులెండి.

నారా—అయితే అదేమిటో చెప్పు చూతాం...

భార—పందెం కూడా కడతారా!

నారా—ఆ...!

భార—అయితే వినండి. ఒక సేటు ఒక అమాంయకుడైన జమీం దారు మీద కత్తి కట్టాడు. అది అన్యాయమైన కేసు. అదే కవరులో ఉన్నదన్నట్లుగా వ్రాశాడు. సేటుపక్షాన మీరు వాదించాల్సిఉంది...అంతేనా...

అహా—ఊఁ...ఊఁ—చెప్పండి!

భార—ఏం—? ఏం చెప్పాను! ఆఁ—! సేటు పక్షాన మీరు

వాదించాల్సిఉంది. వాదించారా...మీ అన్నగా రన్నట్లుగా నిధి వస్తుంది లేదా...అదీ వారే చెప్పారుగా...!

(ముగ్గురూ బిగ్గరగా నవ్వుకుంటారు)

అహా—(ఆలోచిస్తూ) గాంధిజీకీ ఒకప్పు డిలాటి సమస్యే వచ్చింది.

భార—ఇంకానేం? ఆదర్శపురుషుడే ఉన్నాడుగా! అయినా అప్పు డాయన కెలా నిర్ధారించుకున్నారు?

నారా—వేరే చెప్పాలీ!—మహాత్ముల కర్హమైనట్లు గానే.

అహా—కాని ఆ నిర్ణయానికి రావటానికి వారికే కొంత కాలం పట్టింది.

భారతి—మన విషయంలో మాత్రం మించిపోయిం దేముంది?

(ముగ్గురూ గంభీరంగా ఉంటారు)

నారా—అందుకనే—చిన్న కారణాలే మహత్తర పరిణామానికి దారి తీస్తాయని యిందాక నే నన్నాను.

అహ—ఎవరన్నా కాదన్నారా భాయీ!

నారా—(అతి గంభీరంగా, ఆలోచిస్తూ) అహమ్మద్! నా కొకటి తోస్తోంది.

అహ—ఏమిటది—?

నారా—(తాపీగా) ఇంతవఱకు, అంటే, కొంతకాలం క్రితంవరకు మన మీనాటి కుట్రల నెఱుగం. ఈ మధ్యకాలంలో యేదో మనకు తెలియని మార్పు లోకంలో కలిగివుండాలి. లేకపోతే—

అహ—అదీ విచారించాల్సిన విషయమే. షౌకత్ హుస్సేన్ సేట్ జీవితంలో యిలాంటి నీచత్వానికి తావు లేదన్నది జగద్విదితం మరి దీనికి—

భారతి—వీడు చెప్పిందే కారణం. ఏదో—

నారా—ఈ మధ్య మనం చూస్తున్నాం? ఎన్నో చోట్ల కొట్లాటలూ, కొట్టుకెక్కడాలూను. అందులో ప్రత్యేకించి అవి హిందూముస్లింల మధ్యనే జరుగుతున్నాయి. ఏమంటావు?

అహ—ఊ......నిజమే!

నారా—ఎక్కడ అశాంతి పొడ చూపినా మనం యీ రెండు కులాల పేర్లే వింటున్నాం.

అహ—అదీ యథార్థమే.

నా రా—భారతమాత కి రెండుజాతులూ రెండు నేత్రాలవంటివి. దక్షిణభుజం హిందువులయితే వామభుజం మహమ్మదీయులు. హిందువు మేధస్సు అయితే మహమ్మదీయుడు భుజబలం.

అహ—నిజమే...!

నా రా—ఇంతవఱకు అలాగే జరుగుతూవచ్చింది. కాని... యిప్పుడో......

భారతి—ఏముంది—పొరపులు పుట్టినాయి.

నా రా—కారణం...? అదే మన మిప్పుడు విచారించాలి.

భార—విచారించే దేముంది ? ఇదంతా ఆ తెల్లకోతులు చేసిన పనే.

నా రా—(చిరునవ్వుతో) తెల్లకోతులే చేసినాయనుకుందాం, మరి యీ నల్ల కొండముచ్చులకు బుద్ధియెందుకు లేకపోవాలి ?

భార—ఎలా ఉంటుంది ! ఇద్దరిలోనూ వాళ్ళ స్వార్థాన్ని కల్పించారుగా.

నా రా—అయితేమటుకు...?

అహ—ఊ...! అదీ సమస్య.

నా రా—విన్నారూ...! మన నాయకులా విజ్ఞానహీనులు కారు.

భార—కాదని మేమూ అనలేదు.

నా రా— (చిరునవ్వుతో) అదే మనవిచేసు కుంటున్నాను; దొర సానీ...! (గంభీరంగా) కొందరు స్వార్థపరులు యీ అవకాశాన్ని పురస్కరించుకుని ఉన్మత్తభావాలతో యీ ఉన్నకక్షలను పెంచి...

భార—ఊఁ...?

నారా—నాయకత్వాన్ని వహించి, కల్లోలాన్ని రెచ్చగొట్టిలోక క్షయానికి ప్రయత్నిస్తున్నారు.

భార—ఆ స్వార్థపరులే యిలా చేస్తున్నారంటారు! అంతేనా...?

నారా—ఆ...! నిస్సంకోచంగా.

(అహమ్మద్ గబగబా చప్పట్లు కొడతాడు బిగ్గరగా నవ్వుతూ)

నారా—(అహమ్మదుతో) మతిభ్రమ కలగ లేదుగదా!

అహ—కలగ లేదు...తొలగి పోతోంది.

(ఆ యిద్దరివంకా భారతి వెలవెల బోతూ చూస్తుంది)

[వీధిలో కల్లోలం]

అహ—ఏమిటా కలకలం...? (అటుగా చూస్తూ ఉంటాడు)

భారతి—ఏదో అల్లరిగా ఉందే...!

[నారాయణా అహమ్మద్ లు అప్రయత్నంగా బయటకు వెడతారు. వారి వెనుక భీతితో చూస్తూ భారతి ద్వారంవరకూ వెడుతుంది]

ఏదో ప్రళయం వచ్చినట్లుగా ఉందే! (అటే చూస్తూ ఉంటుంది)

[వీధిలో "మారో" "మారో" "కాటో" అన్న కేకలూ, "కొట్టు — నరుకు — చంపు" అన్న అరుపులూ," భాయీ—! శాంతించు—! శాంతించు! అన్న మాటలూ వినిపిస్తాయి. ఒక కత్తి

దెబ్బ నారాయణకు తగులుతుంది. అతడు "అమ్మా" అంటూ పడిపోతాడు. ఎక్కడి జనం అక్కడ సర్దుకుంటున్న అలజడి విని పిస్తుంది.]

అహ—(రక్తంతో తడిసిఉన్న నారాయణను బుజాన ఆన్చుకొని ప్రవేశిస్తూ) అరె...అల్లా!!

[భారతి యెదురుగా వెళ్ళి "రాజా" అని నారాయణను కౌగిలించుకుంటుంది. భారతీ అహమ్మద్ లు నారాయణను మంచం మీదకు చేరుస్తారు]

వదినా...! విచారపడితే లాభ మేముంది? నీ హెచ్చరిక నండగా తీసుకుని గదూ నారాయణ భయ్యాం, త్యాగశక్తిని ప్రదర్శించింది! నువ్వే యిలా బేలవై పోతే అతడేం కావాలి?

భార—(విచారాన్ని దిగమ్రింగుకుంటూ) త్యాగ ప్రదర్శన కిదేనా ఫలితం...?

అహ—ఇదొక లెక్కలోకి వస్తుందా వదినా! నారాయణ భయ్యాం యీ రోజున పునాదిని మాత్రమే వేశాడు. త్యాగానికి హద్దేలా లేదో-విషమపరీక్షకూ అంతే. పరీక్ష యెంత విషమ మయితే ఫలితం అంత దారుణం గానూ మహోన్నతంగానూ లభిస్తుంది.

వదినా...! కొద్దిగా...వేడి...కాఫీ యిస్తే...

(భారతి లోపలకు వెడుతుంది)

భాయీ...! నారాయణ భాయీ...! (చెమ్మగిల్లిన కన్నుల నొత్తుకుంటూ) భాయీ!!

నారా—...భయ్యా...!

[భారతి పరుగునవచ్చి ఆతడ్ని చేరుతుంది]

భార—స్పృహ కలిగిందా...! రాజా...! రాజా...! (అతనిమీద వాలుతుంది)

నారా—ఏమిటిది...? మతి చలించిందా...?

భార—లేదు...రాజా...! లేదు. నాకు చాలా ఆనందం కలుగు తోంది.

(చిరునవ్వుతో కన్నీటిని చిందుతూ ఉంటుంది)

నారా—(లేవబోయి బలహీనతవల్ల పడిపోబోతూ)...భాయీ...!

అహ—(అతడి నాదుకుని) పడినా...! భారకం...

(భారతి గబగబా లోపలకు వెడుతుంది)

భయ్యా...!

నారా—అహమ్మద్ భాయ్...! ఆశయ సౌధంలో అడుగు పెట్ట డానికి యెన్ని సోపానాలు గమించాలో గ్రహించుకున్నావా!

అహ—ఆ...! చాలావరకు.

నారా—నే నిప్పుడు అధిరోహించింది ప్రథమసోపానం మాత్రమే.

అహ—(ఆనందంతో) దానిమీదకే నన్నుకూడా తీసుకుపోవాలి నారాయణభాయీ!

నారా—అదేమిటి...అహమ్మద్! మరో క్షణంలో నువ్వే నాకు మార్గాన్ని చూపాల్సి రావచ్చు.

భార — (ప్రవేశించి)...రాజా...!

(కాఫీనందిస్తుంది)

అహ — (నారాయణచేత త్రాగిస్తూ) అదృష్టం అన్న దాంట్లో యెంతో అర్థముంది కదూ!

నారా — లేదా మరి ?

భార — కనరాని దనేగా దాని భావం!

నారా — ఊం...!

అహ — వదినకు తెలియని విషయం లేదు భాయీ! అందుకనే మనకు చక్కని హెచ్చరిక చేయగలిగింది.

భార — నన్ను భట్రాజులా పొగడటమే మరదిగారికి సంతోషమన్లే ఉంది.

అహ — కాదు వదినా...! నిజమే చెబుతున్నాను.

భార — నీకు నేను చేసిన హెచ్చరిక యేముందని...?

అహ — ఇందాక నా సమస్యను గురించి ప్రస్తావిస్తూ అది మహాత్ములు పరిష్కరించాల్సిన విషయమని సూచించావు. చాలదూ...! ఆ విషయంలో నేను మహాత్ముని మార్గంలోనే నడవ దలిచాను.

భార — మరి...?

అహ — ఆ...! దాన్ని వదులుకోటానికే నిశ్చయించుకున్నాను.

(భాయీ! అంటూ నారాయణ అహంషర్మద్‌ను కౌగిలించు కుంటాడు. భారతి ఆనందాశ్రులు రాలుస్తుంది, నారాయణ పడు కుంటాడు.)

(వీధిలో, 'వకీల్ సాబ్...వకీల్ సాబ్...!' అన్నపిలుపు.)

అహ—ఎవరది...?

భార—(బయటకు చూసి) ఇందాక వచ్చిన...'హిడ్డే...హిడ్డే'

(చిలిపిగా సలాం చేస్తుంది)

అహ—(బిగ్గరగా—చిరునవ్వుతో) ఆఁ!...లోపలకు రావచ్చు.

[ఆవ్యక్తి ప్రవేశించి, తడబడే మాటలతో ధోరణిగా గొణుగుతాడు]

నీ మాటే అనుకుంటున్నాం. ఏదీ...! అలీ...!

భార—ఏం కావాలి...? అలీని బయటకు పంపాను.

అహ—ఇందాక యితడిచ్చిన కాగితాలు...

భార—(మంచం క్రింద నుంచి తీస్తూ)...ఇవిగో...

అహ—(అందుకుని) భాయీ...! ఇవిగో...!

నూ. వ్య—(తడబడుతూ ఆశ్చర్యంతో) జీ...జీ...! నాకీ దీనికోసం వచ్చిందీ మీకూ హెల్లా తెల్సిందీ సాబ్...!

అహ—ఓ—దీనికోసమే వచ్చావా...! నా బరువు సగం తగ్గింది.

నూ. వ్య—అదీ హేమ్టీ వకీల్ సాబ్—!

అహ—ఈ కేసులో వకాలత్ వదలుకుందామని నేనూ అనుకున్నాను. అంతే—!

నూ. వ్య—హెంతా మంచీవారూ వకీలుసాహెబ్! హెల్లా తీసుకుందామా—అనీ సచ్చిపోతుండాన్ సాబ్.

నారా—(లేవబోతూ) తీసుకుపోవాలని నీ కెలా తోచింది

భాయీ—!

[మూ. వ్యక్తి నారాయణను పరికించి చూసి చకితుడౌతాడు.]

మూ. వ్య—అరె... అరె... అల్లా... ! ఇదీ హేమ్జీ ఉస్తాద్...!

నారా—ఏమీ లేదు...! కాని...ఆ కాగితాల విషయం...

మూ. వ్య—అదీ నాకీ సీదా సెప్తా జనాబ్! ఇంత్కీ యిదీ హేమ్జీ
సెప్పండి!

అహ:—ఏదో...

మూ. వ్య—(ఆలోచించి) హిందూకా హిడ్డా గల్భాసేరిందీ హంద్మే
తమ్రూ మూర్ఖాయాకా జనాబ్...!

నారా—ఔను—! అయితే నువ్వప్పు డక్కడే ఉన్నావా!

మూ. వ్య—జీ—జీ! నాకీ కొట్టాబోయిందూ జనాబ్ ఒకా
హిందూ; కానీ వాడ్కీ తక్కర్ తిన్పించీ...

అహ—(సాలోచనగా) అత డెవరో నీకు తెలుసా!

మూ. వ్య—బహుత్ తఫా వాడ్కీ హిడ్డాహిడ్డా సూశాం జనాబ్.
వాడూ వట్టి లఫ్రూట్. పచ్చీ లగా.

నారా—మరి యీ కాగితాలు తీసుకు రమ్మన్న దెవరు ?

మూ. వ్య—వాడు హిడ్డా ఇర్గేవాడూ లేదు జనాబ్. వాడు
ధొరా మాద్రీ ఉన్నాడ్. సూటూ బూటూ వేస్తాడ్.

వకీల్ సాబ్ కీ వకాలత్ యిస్తే నాకీ బుడ్డా రామ్ రామ్ సెప్తానన్నాడ్ జనాబ్. హేమ్మీ సేసేదీ సెప్పండి.

నారా—కారణం యేమనిచెప్పాడు ?

స్యూ. వ్య—కారణంలేదు గీరణాలేదూ జనాబ్; వకీల్ సాబ్ కూ ఎన్నో హెన్నో కూతల్ కూశాడ్. వారు హిందూమన్నీ అన్నాడ్. హిందూ వట్టీ "లుచ్ఛా" అన్నాడ్. వాడీ కూతల్ సెప్పాడాన్కీ నాకీ షరమ్ హౌతా ఉందీ ఉస్తాద్ ! కానీ జనాబ్ - నాకీబుడ్డా నూస్కోవాలా ఉందీలేదూ సెప్పండి !

[నారాయణ నిట్టూరుస్తాడు]

అహ—(కాగితాలు అందిస్తూ) చూడుభాయీ ! ఈకేసు పట్టడం అన్యాయమని మాకుతోచింది. అదే ఉత్తరంలో కూడా వ్రాయదలిచాను. హుస్సేన్ సేట్ జీకి యివి యిచ్చి, నా సలాములు చెప్పు...!

స్యూ. వ—హెంతా బడామన్సూ తమ్మీ వకీల్ సాహెబ్ ! వట్టీ దొంగాకేసూ పట్టాడాన్కి షర్మిందా హౌవ్రా నూస్తాడ్ జనాబ్ ! మీకీ హిల్లా తోచీనందీకి నాకీ యిస్తాక్ హాజార్ సలామ్ !

[కాగితాలు తీసుకొని వెడతాడు]

నారా—భాయీ... ! ఈ రోజున మనయిల్లు స్వర్గంలా ఉందోయీ !

(అహమ్మద్ సగర్వంగా చూస్తాడు)

(వీధిలో. 'సార్...సార్' అన్న పిలుపు)

ఎవరక్కడ...?

[జవాను ప్రవేశించి, నమస్కరించి, నారాయణకు కవరు నందిస్తాడు; వెడతాడు]

నారా—(అహమ్మద్‌కు అందిస్తూ) ఏముంది ఉందో చూడు...!

అహ—(తనలోతాను చదువుకొని నిట్టూర్చి) ఇంతకుముందు నువ్వే మన్నావు భాయీ...! మన యిల్లు స్వర్గంలా ఉందని కదూ?

నారా—ఊఁ......!

అహ—కాని, మనం ఉన్న యీ వాతావరణం నరకం వంటిదని యీ వుత్తరం ఋజువు చేస్తోంది.

భారతి—ఏమని ఉంది...? ప్రిన్సిపాల్ నుంచేనా!

అహ—ఔను...వదినా—!

నారా—ఏమని వ్రాశాడు...?

అహ—నడిబజారులో "మాబ్"తో నువ్వు పోట్లాటకు దిగావుట. పరువూ మర్యాదా లేకుండా ప్రవర్తించావుట. నీ ఉద్యోగ గౌరవాన్నయినా చూసుకోకుండా అధమాధములచేత దెబ్బలు తిన్నావుట. అది తమ కళాశాల ప్రతిష్టకే భంగం కలిగిస్తోందట...

భార...ఇంతకూ యేమంటాడు!

నారా—ఏముంది...! రంజాయిషీయిచ్చుకో మంటాడు. అంతేనా భాయీ!

అహ—అంతకు మించి అన గలదేముంది ?

భారతి—అదేమిటిలెండి ! అధికారమే అతని చేతులోఉంటే సైనిక న్యాయస్థానంలో విచారణ జరిపి శిరచ్ఛేదం చేయించేవాడు.

(ముగ్గురూ నవ్వుకుంటారు)

అహ—భయ్యా.....! సంజాయిషీ తయారు చేయమంటావా !

నారా—అంతతొందర యేముంది ? అయినా నేనే వెళ్ళి ముఖా ముఖిగా...

భార—ఇప్పుడా...? ఈ పరిస్థితిలోనా......?

నారా—ఏమీ భయంలేదు. అయినా యిక్కడేగా...దైవం యేది చేసినా మనమంచికే.

[నారాయణా అహమ్మద్‌లు నెమ్మదిగా బయల్దేరుతారు. వాకిటివరకూ భారతికూడా వెడుతుంది]

[వీధిలో, "డౌను డౌను విత్ మిస్టర్ నారాయణ్! 'డౌన్ డౌను విత్ ప్రొఫెసర్ నారాయణ్...!' అని కేకలు. భారతి అటే చూస్తూ ఉంటుంది. ప్రిన్సిపాల్ వాకిట్లో నల్లజండాలు పట్టుకుని కొందరు యువకులు కనబడతారు.]

భార—(ఆదుర్దాతో) ...అలీ......

అలీ—(ప్రవేశించి) అమ్మా......!

భార—చూడు... ఆకల్లోలం... ! అయ్యగార్లటే వెడుతున్నారు కదూ...! అరెరే...వాళ్ళుఇటే తిరిగారే—అలీ—అలీ— పరుగెత్తు—! మీదపడుతున్నారు... అలీ ... పో ... పరు గెత్తు...!!

[ఆవిడతో పాటు అటుచూసి ఆలీ ఆమె మాట్లాడుతూవుండ గానే చేరువలోవున్న ఒక కట్టనందుకుని పరుగెత్తుతాడు. అటూ యిటూ ఆతృతతో తిరిగి పరుగెత్తడంలో సోఫాకు గుద్దుకొని భారతి పడిపోతుంది; 'రాజా' అంటూ. వీధిలోంచి 'నారాయణ్ మిస్టర్ నారాయణ్' అన్న పిలుపు]

జోసఫ్—(ప్రవేశించి)...అరె...! ఎవరూ లేరే...!

(బిగ్గరగా)...ఆలీ...! (సమా ధానం లేదు)

వాట్ యె కామెడీ...! రహీమ్ కాకా బహురాణీ యెక్కడి కెళ్ళిందో—! (జేబులోంచి ఏవో కాగితాలుతీసి) పోసే...యిదీ బాగానే ఉంది. (సోఫాప్రక్కగా ఒక కాగితాలకట్టను వదులుతాడు)

ఆలీ—(ప్రవేశిస్తూనే)... అమ్మా ... అమ్మా! (జోసఫ్‌ను చూసి నిర్ఘాంతపోతాడు)

జోసఫ్—(చకితుడై) ...ఆలీ...నువ్వా...!

ఆలీ... (వినిపించుకోకుండా) అమ్మా... అమ్మా! (సలువంకలా వెదుకుతాడు. అంతలో జోసఫ్ పారిపోతాడు)

అమ్మా...(సోఫాప్రక్కగా భారతిని చూస్తాడు. నిర్ఘాంత పోయి, జోసఫ్‌ను చూసిన వేపుగాతిరిగి) అరె...వెళ్ళిపోయి నాడే...! అమ్మా...! అమ్మా...!

భార—ఆ...లీ!

ఆలీ—అమ్మా...యేం జరిగింది? ఆ దుర్మార్గు డేంచేశాడు?

భార—ఎవరు...?

అలీ—జోసఫ్ వచ్చాడు గదమ్మా...!

భార—వచ్చాడా—పాపం...! (లేవబోతూ) అతడు వచ్చిందే నాకు తెలియదే...! అయ్యగార్లేరీ—? (పక్కనున్న కాగితాలు తీసి) ఏమిటివి ? (చదువుతూ సోఫాలోకి చేరుతుంది.)

అలీ—అవేమిటమ్మా—? (ఆశ్చర్యంగా అటుచూస్తూ నిలబడతాడు)

భార—(సోఫాలో కూర్చొని) అహమ్మద్ ! అహమ్మదా యిది వ్రాసింది ! ముస్లింలను హిందువులమీదకు రెచ్చగొడుతూ మా అహమ్మదిలా వ్రాస్తాడా ! కాదు, మా అహమ్మద్ యిలా యెన్నటికీ చేయడు. అలీ—!

అలీ—ఏమిటమ్మా—!

భార—అయ్యలు కలాసాగా ఉన్నారా !

అలీ—మన అయ్యోరు ప్రిన్సిపాల్ దొరోరి యింట్లో కెళ్ళారమ్మా! వకీల్ సాబ్ ఎక్కడా కనబడ లేదు.

భార—(సాలోచనతో) వకీల్ సాబ్ కనబడలేదూ ! అయ్యగారి నా స్థితిలో వదిలి అతడెక్కడికో వెళ్ళాడా ? ఉహుం—!

[నారాయణ : ప్రవేసిస్తాడు]

నారా—(వస్తూనే)—అలీ—!

అలీ—జీ—! (నారాయణకు సాయంగా నిలబడి నడిపిస్తుంటాడు. భారతి కూడా లేచి అతడ్ని సోఫాలో కూర్చోబెడుతుంది.)

నారా—రాణీ-! అహమ్మద్ భాయీ రాలేదూ ?

భార—(పరధ్యానంలో) కాఫీ కావాలా—!

నారా—అహమ్మద్ భాయి రాలేదా అని !

(భారతి మాట్లాడదు)

నిన్నే అడిగేది !

ఆలీ—ఇంకా రాలేదు సాబ్ !

భార—(ఇంట్లోకి వెళ్ళి కాఫీ తీసుకునివచ్చి అందిస్తూ) ఒంట్లో ఎలా ఉంది ? ప్రిన్సిపాల్ యేమన్నాడు ?

నారా—(నిట్టూరుస్తూ) ఆలీ—అటుగా వెళ్ళి అతడెక్కడ ఉన్నాడో చూసి పిలుచుకురా !

(ఆలీ పోతూవుంటాడు)

భార—ఆలీ-! (నారాయణతో) అతడినిగురించి యింత ఆరాటం దేనికి ?

నారా—రాణీ-! ఏమి టిలా మాట్లాడుతున్నావు ?

భార—ఏమీ లేదు. వస్తాడు. ఇంతగా ఆతృతపడటం దేనికీ—అని !

నారా—నా కేదో పిచ్చిగా ఉంది. ఆలీ-! వెళ్ళిరా—!

(ఆలీ నిష్క్రమణ)

భార—డాక్టరును పిలిపించనా-!

నారా—వద్దు !

భార—మరి అతడువచ్చి మాత్రం—

నారా—రాణీ—! (గద్దిస్తాడు. భారతి మౌనంగా ఉంటుంది) ఏమిటి యీా నిర్లక్ష్య భావం ?

(భారతి అతనికొక కాగితాన్ని అందిస్తుంది. దాన్ని అతడు పరీక్షగా చూస్తూ నిట్టూరుస్తాడు)

భార—అతడు మిమ్మల్ని యెక్కడ వదిలి పెట్టాడు ?

నారా—నేను మేడ యెక్కుతున్నాను, ప్రిన్సిపాల్ యింట్లో. అంతలో అతడి నెవరో పిలిచారు. ఇక్కడే వుంటాను— నువ్వు మాట్లాడిరావలసింది, అని అతడక్కడే ఆగాడు (ఆగి) ఇది నీకెక్కడ దొరికింది ?

భార—అతడు కూర్చునే యీ కుర్చీక్రిందనే... !

నారా—కాని—చూడు. ఒకవంక తరతరాలుగా వచ్చే మైత్రి. వేరొకవంక యీ కాగితం. నా అహమ్మద్ భాయి...

భార—అద్దంలో చూసుకుంటూ ఆ కారాన్ని గూర్చి మరొకరి నడగటం...

[ఆలీ ప్రవేశిస్తాడు]

నారా—అయితే—ఆ కేసును వదులుకోవటం—?

భార—ఆ రహస్యం యేనాడు బయటపడాలో—?

నారా—ఆలీ !

ఆలీ—జీ! ఎందరినో అడిగాను. ఎవ్వరూ తగిన సమాధానం చెప్పారు కాదు.

నారా—ఆ—ప్రక్క హోటల్లో చూశావా !

ఆలీ—జీ !

నారా—కాలేజీ పిల్ల లెవరూ...

ఆలీ—ఒకరు చెప్పారు జనాబ్—!ఎవరో స్నేహితులు వారిని—
అటుగా—

నారా—ఆఁ—! అటు వెళ్ళివచ్చావా—!

ఆలీ—జీ—! దారిలో జోసఫ్‌సాబ్ కనిపించారు నన్ను చూసి—
ప్రక్కసందుగుండా...

భార—ఆలీ! ఇందాక యిక్కడకు వచ్చాడన్నావుకదూ!

ఆలీ—ఔనమ్మా—!

భార—అప్పుడూ...

ఆలీ—ఔనమ్మా! ఇటుతిరిగి చూసేటప్పటికి వెళ్ళిపోయినారు.

భార—(ఏదో ఆలోచించి) కాఫీ చల్లారి పోతోంది.

[నారాయణ ఆ సంభాషణను ఆశ్చర్యంతో
వింటూవుంటాడు]

భార—మిమ్మల్నే! కాఫీ చల్లారి పోతోంది.

[అంతలో అహమ్మద్ గుమాస్తా పంతులు ప్రవేశిస్తాడు.
ఖిన్నుడై ఉంటాడు.]

నారా—పంతులూ!

పంతు—ఎస్...సార్!

నారా—వకీల్‌సాబ్ కనిపించాడా!

పంతు—ఎస్ సార్! (ఓ కవరును అందిస్తాడు, నారాయణ చింపి
చదువుకుంటాడు)

భార—ఏమని ఉంది—?

నారా—ఎవరో యేదో అన్నారని నాకు దూరంగా ఉండటానికే
నిశ్చయించు కున్నాడుట.

భార—ఈ కాగితాలు పొరబాటున ఇక్కడ పడిపోయినా యని కాదుగదా !

అయినా యెక్కడ ఉండవలిచాడు ? అది ప్రాశాణా ?

నారా—(పంతులుతో) ఈరోజున కోర్టుకు వెళ్ళడం మానుకున్నాడా !

పంతు—ఎస్ సార్—!

నారా—ఆలీ—! వకీల్ సాజ్ సామాను—(కళ్ళు చెమ్మగిల్లుతాయి)

భార—ఏమిటీ వెఱ్ఱి ?

నారా—కానీ ! ఇదెందుకు వచ్చిందో ! (కాగితం అటూయిటూ చూసి) హోటల్ మహాలక్ష్మి లోనా అతడున్నది—!

పంతు—ఎస్ సార్ !

(నారాయణ లేచి ఉత్తరీయం తీసుకొని బైటకు పోతూ ఉంటాడు. భారతి అవనివంక వెలవెలబోతూ చూస్తూ ఉంటుంది. ఆలీ ఖిన్నుడై ఉంటాడు. పంతులు సామానుకోసం రెం డడుగులు ముందుకు వెడతాడు.)

(తెర)

## మూడో రంగం

[అహమ్మద్ జోసఫ్‌లు హోటల్లో ఒక గదిలో కూర్చుని ఉంటారు. అహమ్మద్ యేకాగ్రతతో యేదో ఆలోచిస్తూ ఉంటాడు. జోసఫ్ ఏమేమో గొణుగుతూ ఉంటాడు.]

జోసఫ్—లోకు లన్నారని "ఫీల్" కావటం తెలివితక్కువ కదూ! అలా వారు భావించు కోవటానికి "స్కోప్" యిచ్చింది నువ్వు. ఎంత "ఫ్రెండ్‌షిప్" ఉన్నా యీ వయస్సులో—"మారేజ్" చేసుకోకుండా—

అహ—(కోపంతో) జోసఫ్—! ఈ ప్రస్తావన చాలిస్తే సంతోషిస్తాను.

జోసఫ్—(వికటంగా "ష్యూర్—ష్యూర్" బ్లైండ్ లావ్" నీ నోట్లో కఫమై కూర్చుంది. ఓల్డు ఫ్రెండు మిస్టర్ జోసఫ్ నీ "వెల్‌ఫేర్" కోరి చెప్పేమాటలు "ష్యూర్ మెడిసిన్" అయినా యిప్పుడు గొంతు దిగవు. "ఇట్ ఈజ్ నాచురల్!

అహ—యథార్థం గ్రహించ లేనప్పుడు నీకూ వారికీ భేద మేముంది? మిత్రుడవైన నువ్వు నాతో సానుభూతి చూపింది మాత్రం యేది?

జోసఫ్—ఈజ్ యిట్? ఓ—! అలా అడుగు, చెబుతాను. "ఫాక్ట్" గ్రహించడ మన్నది "స్కోప్" దొరకందే జరిగే పని కాదు. అది యింతవరకూ నువ్వు నాకు

కలిగించలేను. అందుకనే యెన్నిసార్లో నిన్ను "బెగ్"
చేశాను. నీ "ఇనోస్సెన్స్"ను నువ్వు కాటుకోవాలంటే
ఆ "ఎంజల్"ను వదలి బయటగా ఉండమని—

(అహమ్మద్ జోసఫ్ వంక చురచురా చూస్తాడు)

ఇక "సెకండ్ పాయింట్" నీతో నేను "సింపతైస్"
చేయలేదన్నావు. అన్నావు కదూ! అయితే యీ ప్రశ్న
లకు జవాబు చెప్పు! ఆ రోజున నారాయణ భాయీమీద
"మాబ్" విరుచుకుపడి అంతగా "ఇన్‌సల్టు" చేసినప్పుడు
నీకుగూడా ఆ గతే పట్టకుండా చేసిం దెవరు? ఇంతకు ముందు
మన ముస్లిం స్టూడెంట్సు అందరూ "ఆంటీ హిందూ
ప్రాపగాండా" సాగిస్తూ "రష్" అయినప్పుడు నిన్ను
ప్రక్కకులాగి అతడికీ నీకూ సంబంధం లేనట్లుగా నటింపచేసిం
దెవరు? హిందువులలోని "మాస్ మెంటాలిటీ" యే "పర్స
నాలిటీ"కి భయపడి గజగజలాడుతోంది? వింటున్నావుకదూ—!
థర్డ్లీ—! నిన్ను నే నెంతగా "సేవ్" చేశానో నీకే తెలుసు.
కాని, నీ విప్పుడు "రికగ్నైజ్" చెయ్యవు. దానికి కారణం
నీలో ఒక "కార్నర్" లో ఒక "వీక్‌నెస్" ఉంది. అదీ
ఆ "హిందూ ఎంజెల్" భారతి వల్లనే వచ్చింది.

(నారాయణ ప్రవేసించి ఆ తుదిమాటలు విని ఆగిపోతాడు;)

అహ—జోసఫ్—! (గర్జించాడు)

జోసఫ్—(వికటంగా...నారాయణను చూడకుండానే)

సారీ మిష్టర్ అహమ్మద్! 'ఉన్నఫాక్ట్స్' ఉన్నట్లుగా'
'యూజిటీజ్' బయట పెట్టడం 'జంటిల్‌మన్' నైన నా

లక్షణం, 'డట్ టూ యీాజ్ దె ఫాక్ట్'. నాబోటి 'స్పాట్ లెస్ పర్సనాలిటీస్' ప్రపంచానికి యెప్పుడూ 'యెనిమీస్' గానే కనబడతారు. అయినా నా 'ఫర్డు పాయింట్' విను. ఇదే 'లాస్టు' కూడాను. ను వ్వీమధ్య మా 'కమ్యూనిటీ'ని 'హిందూస్' మీదకు 'ప్రొవోక్' చేస్తూ, 'గూండాయి జాన్ని' 'టికిల్' చేస్తూ, 'పబ్లిష్' చేసిన కరపత్రం నాదగ్గరకు వచ్చింది. అదీ సి. ఐ. డీ డిపార్టుమెంటుద్వారా; కాని, అప్పుడు నేనేంచేశాను? 'ఇమ్మీడియట్' గా డి. యస్. పీకి 'ఫోన్' చేసి, యేవిధమైన 'యాక్షనూ' తీసుకోకుండా 'వితిన్ దె మినట్' 'సబ్ సైడ్' చేయించేశాను. అంటే- ఆకేసు పూర్తిగా యెత్తేశారనుకో.

[కరపత్రం మాట వచ్చేటప్పటికి అహమ్మద్ చికాకుపడి మండిపోతూ ఉంటాడు అడంతా జోసఫ్ కనిపెడతాడు.]

అహ— జోసఫ్—! (గద్దించాడు)

జోసఫ్—(వికటంగా నవ్వుతూ) మిష్టర్ అహమ్మద్ ! ఆ 'ఇరిటేషన్' మంచిదికాదు. అదీకాక నీ కేకలకు మిష్టర్ జోసఫ్ భయపడతాడనుకోవద్దు. జంటిల్‌మన్' గా బ్రతకాలంటే కావలసింది "ఎడ్యుకేషన్" కాదుఅహమ్మద్— "కామన్ సెన్సు."

(నారాయణ ఆ తుది మాటలు వింటాడు. చకితు డౌతాడు; గిర్రున తిరిగి వెళ్ళిపోతాడు.

[పంతులు ప్రవేశిస్తాడు; చేతిలో ఆనాటి పత్రిక ఉంటుంది. జోసఫ్ అది చూసి కలవర పడతాడు].

అహ—(పత్రిక నందుకుంటూ) పంతులూ—! బండీవచ్చిందా !

పంతులు—కమింగ్ సార్—!

(జోసఫ్ కలవరపడతాడు; ఎలా వెళ్ళిపోదామా అని చూస్తూ ఉంటాడు.)

అహ—(పేపరులో చూస్తూ) "హిందూముస్లిం సఖ్యతే భారత స్వాతంత్ర్య సాధనం" (పైకి చదువుతాడు)

జోసఫ్—(లేవబోయి) ఎక్స్క్యూజ్ మీ ! ఐ షుడ్ గో ! (లేస్తాడు)

అహ—"ప్రొఫెసర్ నారాయణ్ వకీల్ అహమ్మద్‌ల దేశద్రోహ చర్యలను ఖండిస్తూ ప్రపంచ శాంతి మహాసభా సభ్యుడు మిస్టర్ జోసఫ్ హెచ్చరిక." (బిగ్గరగా చదువుతుంటాడు)

(తెరలో) వకీల్ సాబ్—వకీల్ సాబ్—!

పంతులు—(ముసిముసి నవ్వులతో)—"బండి" సార్—!

(తెరలో)—వకీల్ సాబ్—వకీల్ సాబ్ !

నారా—పంతులూ—! ఆలీ గొంతల్లే ఉంది—!

జోసఫ్—ఎస్—కమింగ్ ! (ఆగి, కలవరపడుతూ తిరిగి లోపలకు వస్తాడు.) పంతులూ ! యిక్కడ యూరినల్—(గబగబా దొడ్డివేపుకు వెడతాడు)

[నెత్తురుతో తడిసిన బట్టలతో, తలమీద పెద్ద గాయంతో పంతులు సాయంతో ఆలీ ప్రవేశిస్తాడు ]

ఆలీ—(కళ్ళు మూసుకునే)—జనాబ్—! జనాబ్—! ! వకీల్ సాబ్—! ! !

(అహమ్మద్ వెంటనే లేచి అతడ్ని చేరుతాడు)

అహ—ఆలీ—! యేమిటీ ఘోరం—?

ఆలీ—(కూలబడి)—జనాబ్ ! మార్ ఖాయా జనాబ్ ! బహుత్
మార్ ఖాయాజనాబ్—! (రోదిస్తాడు)

అహ—అయ్యగారూ వదినగారూ క్షేమంగా ఉన్నారా !

ఆలీ—అయ్యగా రిటే వచ్చారుగా జనాబ్ !

అహ—ఇటేవచ్చారా ? లేదే—!_పంతులూ_!

(పంతులు తెల్లముఖం వేసి చూస్తాడు)

నారాయణ భాయి యింటికి తొందరగా వెళ్ళు ! నేను యితడితో ఆసుపత్రికి వెళ్ళి వస్తాను.

(పంతులు నిష్క్రమిస్తాడు)

(అహమ్మద్ దొడ్లోకి వెళ్ళి తిరిగి వచ్చి నిట్టూరుస్తాడు)

ఉహుం—స్కాండల్ !

(తెర)

# నాలుగో రంగం

[భారతి, యింట్లో చెదిరి పడిఉన్న సామానును సర్దుతూ ఉంటుంది. అద్దంపగిలిన తన పెనిమిటి పటాన్ని మెత్తి చూస్తూ, సోఫాదగ్గరకు చేరుతుంది. ఆమె గ్రుడ్లల్లో నీళ్ళు తిరుగుతాయి.]

భారతి—రాజా! నువ్వు చేసిన పాపం యేమిటి? నీ హృదయమే నిన్నెందుకు యిలా మోసగించాలి? నీ అమాయకత్వమే కదూ నీకీ కష్టాన్ని తెచ్చిపెట్టింది! నీ అభిమానమే కదూ నిన్నిలా అవమానిస్తోంది! రాజా...! ఎంతటి పిచ్చి మహా రాజువైనావో ఊహించుకో! "అన్నా...అన్నా..."అని పిలిచే అతడే నీకు శత్రువైనాడు; గ్రహించావా! అతని కాశ్రయ మిచ్చినందుకే గదూ నీ జాతి నీకు దూరమయింది ఊహుఁ...! చదువుకునే పిల్లల్లో ఉన్న స్వమతాభిమానం నీలో యెందుకు లేకపోవాలి; రాజా! పాముకు పాలుపోసి పెంచినట్లయిందే మనబ్రతుకు! (కన్నీరు రాలుస్తుంది.)

[పంతులు గబగబా లోపలకు వస్తాడు. భారతిని చూసి అమాంతంగా ఆగిపోయి ఏదో బరువు దింపినట్లుగా శ్వాస విడుస్తాడు. భారతి అతడివంక చూసి, కన్నీరు తుడుచుకుంటుంది.]

పంతులూ...!

పంతులు—ఎస్...మాడమ్!

భారతి—అంతగా ఆయాశ పడుతున్నావు...!

పంతులు—(చెమట నార్చుకుంటూ) ఎస్...ఎస్...మాడమ్! అసలు ప్రాణమే పోవలసింది మాడమ్...మా అమ్మ కడుపు చల్లగా ఆయాశంతో ఆగింది కాని.

భారతి—(మందహాసంతో) కారణం...?

పంతులు—కారణం యేమిటి మాడమ్...! ఆలీగాడ్ని చూసి హడలి చచ్చామంటే నమ్మండి.

భారతి—అయితే...అయ్యగా రెక్కడున్నారు!

పంతులు—అది నాకేం తెలుసు మాడమ్! ఆలీ మా వకీల్‌సాబ్ దగ్గర కొచ్చాడు; అక్కడి మాట నేను చెప్పేది.

భారతి—(ఆలోచిస్తూ) నిన్ను వకీల్‌సాబ్ పంపా రన్న మాట.

[నారాయణ ప్రవేశిస్తాడు : వాకిట్లో ఉండే
యీ ప్రసంగాన్ని వింటాడు]

పంతులు—ఎస్, మాడమ్!

భారతి—ఖులాసాగా ఉన్నారుగా...!

పంతులు—ఎస్, మాడమ్! మీ రెలా ఉన్నారో కనుక్కుని రమ్మన్నారు కూడా.

భారతి—ప్రొఫెసర్ గారిని గురించి...!

పంతులు—ఏదో ఆలోచనలోనే ఉన్నారు...మాడమ్! మరి... నాకు...

(నారాయణలో భరింపరాని అవమానం ద్యోతక మౌతుంది)

భారతి—ఆయన ఆలోచనలకు నేను చాలా ఆనందించానని చెప్పు...! పో...!!

(మెట్లు దిగి ఓ ప్రక్కగా తొలగి నిలబడతాడు; నారాయణ)

పంతులు—ఎస్, మాడమ్...!

(నిష్క్రమిస్తాడు. అతడు వెళ్ళగానే తిరిగి నారాయణ గడప లోకి చేరుకుంటాడు)

భారతి—ఉహుఁ...! కృతఘ్నుడు. ఇంకా యేదో ఆలోచనలోనే ఉన్నాడుట. (పటాన్ని యెత్తి) ప్రొఫెసర్ గారూ...ప్రపంచాన్ని మీరే అర్థం చేసుకోలేరే పిల్లలకేం చెప్పగల రండీ... !

(ఆతుది మాటలు విని నారాయణ్ చాలా బాధపడతాడు) అహమ్మద్...! నువ్వెంత దూరంగా తొలగిపోయినా నేనుమాత్రం నిన్ను వదలను.

(ఆపలుకుల్లో నారాయణ యేదో అపార్థాన్ని తీసుకుని సహించలేని యాతన ననుభవిస్తాడు)

[ఒక జవాను టెలిగ్రాంతో ప్రవేశిస్తాడు. వాకిట్లోనే నారాయణను చూసి అతని కందించి వెళ్ళిపోతాడు. నారాయణ దాన్ని విప్పి చదువుకుని కన్నీరు కారుస్తాడు. వెళ్ళలేక లోపలకు ప్రవేశిస్తాడు.

భారతి—(అత్యుత్సాహంతో)...రాజా...!

(నారాయణ ఆ మాటను అసహ్యించుకుంటాడు. ఆమెవంక చూడకుండానే సోఫాలో కూలబడతాడు)

రాజా—...! (అతని మీదకు చేతిని వేస్తుంది. అతడు ఆమెను తీక్షణంగా చూసి చేతిని దూరంగా తోస్తాడు. ఆమె కష్ట పెట్టుకుని యేమీ అర్థం కాక వెర్రిగా అతడి వంక చూస్తూ ఉంటుంది)

నారా—...అలీ...!

భారతి—ఇంట్లో లేడు.

(నారాయణ లేచి బయటకు వెడుతూ ఉంటాడు)

చూడండి...!

నారా—(ఆగి) ఏమిటి...?

భార—ఎక్కడికి...యీ ప్రయాణం...?

నారా—వీట్లోకి...! (వెడుతూ ఉంటాడు. భారతి అమాంతం అతడ్ని చేరి పాదాలకు చుట్టేసుకుంటుంది, రాజా! అంటూ. అత డామెను ప్రక్కగా తోసి వెళ్ళిపోతాడు. ఆమె లేచి అటే చూస్తూ ఉంటుంది; దీనంగా.)

(తెర)

---

## వీ ధి లో

[జోసఫ్ నారాయణకు యెదురౌతాడు]

నారా—...జోసఫ్...!

జోసఫ్—(ఆగి...) ఆఁ...! ఓ...మిస్టర్ నారాయణ్ గుడ్ మార్నింగ్...!

నారా—జోసఫ్...! నీతో మాట్లాడాలి!

జోసఫ్—ఆల్...రైట్! కమాన...!

నారా—చూడు! ఇది అతిరహస్యం.

జోసఫ్—ఓ...గుడ్ న్యూస్!... చెప్పు!

నారా—నేను...నీకు...

జోసఫ్—నువ్వు నాకు బ్రదర్...! అది ఫాక్టే.

నారా—అది కాదు. నేను నీకు...ఎప్పుడోనన్నా...యే అపకారమన్నా... చేశానా అని.

జోసఫ్—నో...నెవ్వర్!

నారా—...సోదరులమధ్య...కలహం...

జోసఫ్—ఎస్...ఎస్. యెప్పుడూ తప్పే.

నారా—...ఒకరికొకరు ద్రోహం చేసుకోవటం...

జోసఫ్—అది క్రిష్టియానిటీకే విరుద్ధం.

నారా—ఇందులో మతం ప్రసక్తి యెందుకు? పనం...

జోసఫ్—నో...నో...నో...! అలా భ్రమపడకు; మిస్టర్ నారాయణ్! ప్రపంచవ్యవహారా లన్నింట్లోనూ మతానికెంతో ప్రాముఖ్యం ఉంటుంది. ఏమంటావు? ఫర్...ఎగ్జాంపుల్... మనమే ఉన్నాం. నువ్వో హిందూ. చూస్తూచూస్తూ డెలిబరేట్‌గా యెవరికీ ద్రోహం చెయ్యలేవు. నీ వాడే మిస్టర్ అహమ్మద్; అతనో ముస్లిం. అవసరం అనుకుంటే నీ పచ్చినెత్తురు నే తాగేస్తాడు. సరి...! నే నున్నాను; ఎ సెంట్ పర్సెంట్ క్రిష్టియన్. చచ్చేది అబద్ధం ఆడలేను. అన్యాయం చేయలేను. ఎక్కువ తక్కువలు నా ఊహకే రావు. సర్వసమత్వం నా ప్రిన్సిపుల్; చూశావా; మన ముగ్గురిలోనే యెంత భేదం ఉందో! అందుకనే నేను మతానికి "ప్రిఫరెన్సు" యిస్తాను; అన్నిటికంటేకూడా. ఊఁ—ఇక చెప్పు!

నా రా—(ఆలోచిస్తూ) మనలో మనకంత భేదం ఉంటుందా అని!

జోసఫ్—ఓ-వాట్ యె పిటీ! నువ్వు నమ్మనన్న మాట. అయితే మిస్టర్ నారాయణ్! నీ అనుభవం అంతా వ్యర్థమైపోతున్నట్టు? నేకెడ్ ట్రూత్ చెప్పినా "బిలీవ్" చేసేట్టు లేవే

నారా—అదికాదు జోసఫ్—!

జోసఫ్—కాదేమిటి? మీ హిందూస్‌లో ఉన్న "వీక్‌నెస్ అదే. దానివల్లనే మీ గౌరవం. మీ పెద్దల గౌరవం, మీ వంశ గౌరవం చివరకు మీ జాతి గౌరవం కూడా నాశనమైపోతుంది.

నారా—(ఆగి) ఆ—! యిక వెళ్ళొస్తాను.

జోసఫ్—అసలు విషయం చెప్పావుకాదు.

నారా—సమాధానం వచ్చేసింది; చాలు. (వెడుతూ ఉంటాడు వెఱ్ఱిగా)

జోసఫ్—అయితే గుడ్ బై—! (వికటంగా నవ్వుతాడు)

[మరొక దిక్కునుంచి ఆలీ ప్రవేశిస్తాడు. తలకు కట్లుంటాయి. అతనికి వెనుకవున్న తెర లేచేటప్పటికి భారతి తన భర్త చిత్రపటాన్ని ఒళ్ళో ఉంచుకొని నేలమీద కూర్చుని ఉన్నదృశ్యం కనిపిస్తుంది]

ఆలీ—(ఆశ్చర్యంతో)—అమ్మా—!

భారతి—(అతనివంక చూసి తల వాల్చుకుని లోలోన రోదిస్తూ)... ఆ—లీ—!

ఆలీ—అయ్యగా రేరీ—!

(భారతి మాట్లాడదు)

అమ్మా! ఊరెళ్ళారా—!

భారతి—(కన్నీరద్దుకుంటూ) ఏ ఊరు—?

ఆలీ—పెద్దయ్యగారికి జబ్బుచేసింది గదమ్మా.

భారతి—ఏమిటి—? ఎప్పుడు—?

ఆలీ—జబ్బుచేసి మన ఊరి మునసబయ్య కోటిరెడ్డి ఆసుపత్రికి వచ్చాడు. పిచ్చాపాటీ మాట్లాడుతూ "ఏరా ఆలీ!— నాలుగు నాళ్ళనుంచీ నాయకుడికి జబ్బుగా ఉంటే ఒక్కరూ రాలేదేరా!" అన్నాడు.

భారతి—మామయ్యగారికా—! జబ్బుగా ఉందా! (ఆవేశంతో అడుగుతుంది)

ఆలీ—ఔనండమ్మా! పైగా రెడ్డన్నాడు—పట్నం వచ్చాక మారిపోయారులేరా—మాకు తెలుసు—" అని. నాకు చెడ్డ కష్టమేసిందమ్మా!

భార—(తలవాల్చుకునే) ఊఁ—!

ఆలీ—నే నన్నాను—లోకం మారిందేమోగాని— మా దొరలు మారలేదు—అని

భార—ఇంతకూ యిప్పుడెలా ఉన్నారో—!

ఆలీ—నిన్న సాలా మోపుగా ఉందంటమ్మా. మరి—ఇంతకీ మన అయ్యోరు—

భార—(నిట్టూర్చి) ఉహుఁ—! అక్కడికే వెళ్ళిఉంటారు.
ఆలీ—అదేమిటమ్మా—మీతో చెప్పకుండా నే—! వకీల్ సాబ్ కు కూడా—

(భారతి దోసిట్లో ముఖాన్ని కప్పుకొని రోదిస్తుంది)

(వాకిట్లో నిలబడి అహమ్మద్ 'నారాయణ్ భయ్యాఁ...' అని పిలుస్తాడు)

ఆలీ—(అటుగాచూసి) వకీల్ సాబ్ !

(భారతి తలెత్తి...ఏదో ఆలోచించి తిరిగి అవనతవదన వౌతుంది)

అహ—ఆలీ—?

ఆలీ—ఆయియే వకీల్ సాబ్—! అందర్ ఆయియే ! (వాకిటివేపు వెడతాడు)

అహ—నారాయణ భయ్యాఁ లేడూ !
ఆలీ—లేరు !
అహ—వదినగారు కులాసాగా ఉన్నారుగా.
ఆలీ—నై సాబ్—! ఊహూ—రోదుస్తున్నారు.
అహ—(కలవరపడి) దేనికి—?

(ఆలీ పెదిమ విరుస్తాడు; తనకు తెలియదన్నట్లు అహమ్మద్ లోపలకు రెండడుగులు వేస్తాడు; జంకుతూనే.)

సలాం...వదినా—!

భార—(తలెత్తకుండానే) ఆలీ—!

(ఆలీ ముందుకు వస్తాడు)

ఎందుకు వచ్చాగో కనుక్కో !

అహ—(చకితుడై, దీనంగా) వదినా—!

భార—అలీ—! కృతఘ్నుల కీ యింట్లో స్థానం లేదని చెప్పు.

(అహమ్మద్ గిఱ్ఱున వెనక్కు తిరిగి నిలబడతాడు. ఆలీ యేమీ తోచక వెఱ్ఱిగా నిలబడతాడు)

అహ—ఆలీ—! (కన్నీరు కారుస్తాడు)

భార—(అది గ్రహించి...తీవ్రంగా) అన్న సంసారాన్ని మన్ను చేసిన—

అహ—(సహించలేక...బిగ్గరగా)—వదినా...!

(చిర చిరా వెళ్ళిపోతాడు)

భార—ఆలీ...! వాకిలి తలుపు వేసిరా...!

(ఆలీ అతి నీరసంగా వెడతాడు)

(తెర)

—

[వీధిలో చేతిలో రివాల్వరుతో జోసఫ్ నారాయణ యింటి వైపుగా వస్తూంటాడు]

జోసఫ్—ఓ...మైగాడ్...! ఆలీగాడి మూలంగా నా 'ఎంజల్' పంజరంలో పిట్టయిపోయిందో! నన్ను చూసే ఆ 'ఇడియట్'

"షోర్సు" మూసేశాడు—ఆల్ రైట్—!(గడియారంచూసుకుని) ఓ...ఇట్ యీజ్ లైట్ !

(నాలుగు వంకలా చూసి, రెండడుగులు ముందుకు పోయి, రివాల్వర్ నుద్దేశించి) లైఫ్ ఆఫ్ మై లైఫ్—! ఇక నిన్ను ఎంతో కాలం "ఐడిల్" గా ఉంచను. నీకేం కావాలి...? "బ్లడ్", "ప్యూర్ రెడ్ బ్లడ్". దట్ యీజ్ ఆల్ ! (వికటంగా నవ్వుతూ) ఆల్ రైట్ ! యు విల్ హేవ్ యిట్ ! (రివాల్వరును చుంబించి జేబులో దాస్తాడు)

బ్రదర్ నారాయణ్ ! డియర్ బ్రదర్ నారాయణ్ !

(లోపలనుంచే "ఎవరది" అన్న శబ్దం)

(తనలో) ఓ...! ఈజ్ యిట్ మై లా...? (పైకి) ఆఁ—! నేనే... మిస్టర్ జోసఫ్ ను.

[తెర యెత్తగానే ఆలీ కనిపిస్తాడు]

ఓ—యూ...ఆలీ—! బ్రదర్ నారాయణ్—యింట్లో ఉన్నాడా—!

ఆలీ—(చిటమట లాడుతూ) లేరు—!

జోసఫ్—(నములుతూ) పోనీ—మా—(గుటకలు మ్రింగుతూ) కాదు కాదు మీ—అమ్మగారు—?

ఆలీ—ఏదోపనిమీ దున్నారు:

జోసఫ్—ఆల్ రైట్ ! (లోపలకుపోతూ ఉంటాడు. ఏమీ అనలేక ఆలీ అలాగేచూస్తూ ఉంటాడు) ఏదీ—క్వీన్—ఆఫ్ ది హౌస్—భారతీదేవి !

భార—(ప్రవేశించి)—ఎవరది—? ఓ—మీరా—!

జోసఫ్—ఎస్—వదినా—నేనే! (వెళ్ళి సోఫాలో కూర్చుంటాడు)

భార—(దూరంగా తొలిగి నిలబడి) ఏం పనిమీద వచ్చారు?

జోసఫ్—(సోఫాలో ఉన్న టెలిగ్రాంను చూసి, చదువుకుంటూ ఆం—!ఏమిటి—? నే నెందుకు వచ్చాననా—! వాట్ యె సిల్లీ క్వశ్చన్? (కులుకుతాడు)

ఆలీ—! "టీ" తెచ్చిపెడతాను కదూ...! (ఒక నోటు నియ్య బోతాడు. ఆలీ భారతి వంక చూస్తాడు; యేం చేయాలో తోచక) ఓ...! అమ్మ గారి ఆజ్ఞ కావాలికదూ...! వాట్ యె ఫెయిత్ఫుల్ సర్వెంట్! (వికటంగా నవ్వుతాడు)

భార—(జోసఫ్‌తో) ఒద్దు లెండి...! (ఆలీతో) ఆలీ... ఇంట్లో... ఫ్లాస్కులో...

జోసఫ్—(పాచిక పారలేదే అన్నట్లుగా ముఖం చిట్లించుకొని) ఓ_ థ్యాంక్యూ...థ్యాంక్యూ...అయినా—ఆలీ! ఇదిగో ఒక పాకెట్...

భార—ముందుగా టీ సేవించండి! (ఆలీ లోపలకు వెడతాడు.)

జోసఫ్—థ్యాంక్యూ — థ్యాంక్యూ—! ఆం!—వదినా! నీతో అతిరహస్యంగా మాట్లాడాలి. దట్ యీజ్ మోస్టు ఇంపార్టెంట్.

భార—ఏమి టా విషయం—?

జోసఫ్—అది నీ జీవితానికి సంబంధించిన "ప్యూర్లీ యె పర్సనల్ అఫైర్."

భార—(ఆలోచించి) నా జీవితానికా—!

జోసఫ్—ష్యూర్లీ! (కొద్దిగా ఆమె ఉన్న వేపుకు జరిగి) నీ "లైఫ్" యిప్పుడు "డేంజర్"లో ఉంది. నీ "ఆనర్" అంటే, గౌరవం నీటి బుడగలా ఉంది. అంటే, యే క్షణాన పోయినా పోవచ్చునన్నమాట. నిన్నిప్పుడు తోడేళ్ళ మధ్య మేకపిల్లలా ఉన్నావు. అర్థమౌతోందా? ఊఁ...! ఇంతకూ అడగటం మరచాను. అహమ్మదు మన యింట్లోంచి యెందుకు వెళ్ళినట్లు?

భార— తెలియదు.

జోసఫ్—వాట్ ఎ వండర్‌ఫుల్ గరల్ యు ఆర్—! ఔను. నీ విషయమే నీకు తెలియదు. ఇతరుల విషయం ఎలా అర్థమౌతుంది? ఆల్‌రైట్! అసలు విషయానికొస్తాను— అమహ్మదున్నాడు చూశావా? వాడు వట్టి స్కౌండ్రల్. పిల్లిరూపంలో ఉన్న పులి, నువ్వూ ఆ ఫాక్టును యీ పాటికి గ్రహించే ఉంటావు. ఔనా...?

భార—(సాలోచనగా)—ఆ—!

జోసఫ్—గుడ్! వాడు నిన్నూ నా బ్రదర్ నారాయణ్‌నూ వేరు చేయాలని నిశ్చయించుకున్నాడు.

భార—ఊఁ—!

జోసఫ్—అదీ—వెంటనే చేయ తలచాడు. అంటే నేడో రేపో అన్నమాట.

[అహమ్మద్‌ను గురించిన ప్రసంగం వచ్చేటప్పటికే ఆలీ వారికి చేరువలోకి వచ్చి తలుపుచాటున నిలబడి వినసాగాడు]

భార—ఆఁహాఁ...!

జోసఫ్—అది నేను సహించ నని గట్టిగా చెప్పేశాను, అవసరమైతే ఆ "యప్టెట్టుల్లో" ప్రాణాన్ని కూడా అర్పిస్తా నన్నాను. సరి. ఇక్కడ మూర్దాషూ బ్రదర్ ఊళ్ళోలేడు. వెళ్ళేప్పుడే నాకు వార్నింగ్ యిచ్చాడు; ఇల్లు జాగ్రత సుమా అని. రామా కాకాకు ప్రాణంమీదకు వచ్చిం దన్న విషయం అతణ్ణి మొంతగానో "అప్సెట్" చేసింది. ఆ టెలిగ్రాం చూడగానే అతడికి షిప్పెక్కి నట్లయింది.

భార—(పూర్వవిషయాల నన్నింటినీ ఊహించుకుంటూ) ఊఁ...!

[అలీ ఆ సంభాషణను ఆపా లన్నట్లుగా యేమీగా మెరగనట్లు ప్రవేశిస్తాడు; "చా" కప్పుతో, జోసఫ్ తలవంచుకొని ఉంటాడు; మౌనంగా. భారతి అతనిచేతిలోని కప్పును అందుకుని జోసఫ్ ముందున్న బల్లమీద ఉంచుతుంది.]

జోసఫ్—! థ్యాంక్యూ...థ్యాంక్యూ... !! వదినా... ! అలీని... పంపి...

భార—అలీ...! (ఆయన మాట వినమన్నట్లు చూస్తుంది)

జోసఫ్—ఇదిగో...దీంతో ఒక ప్యాకెట్...యిది తీసుకురా... (ఒక పెట్టె నందిస్తాడు)

అలీ—(వెళ్ళబోతూ మండిగానికేసి కాలు కొట్టుకుని) అల్లా... ! (కూలబడతాడు)

జోసఫ్—(గడియారం చూసుకొని) వాట్ ఎ పిటీ...! ఊఁ... ! వదినా ఇప్పటికే చాలా లేట్ అయింది. బ్రతికి బాగుంటే రేపు కలుసు కుందాం, (లేవబోతాడు)

భార—ఈ రాత్రికి యిక్కడే...ఉంటె...?

[ఆలీ ఆమెవంక చురచురా చూస్తాడు. ఆమె గ్రహించుకోదు]

జోసఫ్—మన మేపనిచేసినా లోకానికి వెరవాలి వదినా ? దట్ యీజ్ లైఫ్.

భార—మరి—ఆ—విషయం—!

జోసఫ్—(నవ్వుతూ) మాట తప్పటమన్నది మా జాతిలోనే లేదు!— గుడ్ నైట్—!

(నిష్క్రమిస్తాడు)

[ఆలీ అతడి వంక మండిపోతూ చూస్తాడు. ఏమీ తోచక భారతి జోసఫ్ వంక నే చూస్తూ ఉండి పోతుంది]

తెర పడుతుంది.

---

# ఐదో రంగం

[స్థలం—అహమ్మద్ విడిది.]

అహ—(బాధతో) భయ్యా...! నీ నీడనే నువ్వు నమ్మకుండా ఉన్నావా! ఒక కంచంలో తిని, ఒక మంచాన పడుకున్న మనమే విరోధుల మైతే లోకం మాట చెప్పే దేముంది? మన తండ్రులు మనకు ప్రసాదించిన విజ్ఞానం యీ మన చర్యతో వృధా అయినట్లేగదూ। (అతి దీనంగా) మీకు నేనే మపకారం చేశాను? అసలటువంటి నీచభావం నాలో అంకు రించిందని అయినా నువ్వు విశ్వసించగలవా...చెప్పు! తల్లి వంటి వదినగారే నన్ను కృతఘ్నుడని నిందించారే ...ఇక నే నెవరికి నా విషయాన్ని చెప్పుకునేది? ఇక నా నడవడిని సరిగా గ్రహించగల వారెవ రున్నారు?—అబ్బబ్బా... తల పగిలిపోతోంది! నాహృదయం యీ అన్యా యాన్ని భరించలేక యిలా కుమిలిపోయేకంటె ఒక్క మారుగా ఆగిపోతే బాగుంటుంది.— భయ్యా! మన ఆశయాలిక భగ్నం కావలసిందేనా! మన తలి దండ్రులూ, వారి పూర్వులూ సృజించిన మన మైత్రి యిక మన్ను పాల్గావలసిందేనా! ఒక క్షణంలో యెలా మారి పోయినారు భయ్యా...మీ దంపతులు! ఒక్కసారిగా నా జీవితాన్ని పాతాళాని కెలా త్రోశారు వదినా; మీ జంట!

('వకీలుసాబ్' అన్న పిలుపు)

ఎవరది...?

[ఒకడు నోట్లు లెక్కపెట్టుకుంటూ ఎదురుగా వస్తూఉం టాడు. ఈలమోత విని జోసఫ్‌ను చూస్తాడు; టార్చి వేసి.]

జోసఫ్—...హుస్సేన్...!

హుస్సేన్—జీ...!

జోసఫ్—ఎక్కడికో పోతున్నావు ?

హుస్సేన్—హెక్కడ్కీ పోతాన్ జనాబ్...! హిడ్కే ఒక్క సుక్కా వేసీ...

జోసఫ్—నా మాటలు గుర్తున్నాయి కదూ...!

హుస్సేన్—మాటా కొక్కనోటూ కట్టాన్ జనాబ్! నాకీ మాటా సచ్చీ పోయ్యాన్న ఝూటా లేదుఉస్తాద్? ఊఁ...! (మీసం మెలేస్తాడు)

జోసఫ్—నన్ను బయట పెట్టకూడదు సుమా!

హుస్సేన్—సచ్చీనోడూ వస్తాడ్ ఉందీ ఉస్తాద్...! హాంతే మీకీ మాటా! (మాటాడుతూనే సలాం చేసి వెళ్ళిపోతాడు. జోసఫ్ తన దారిన తాను వెడతాడు; ఈల వేసుకుంటూ)

[భా ర తి యి ల్లు]

[భారతి అవనత వదనయై సోఫాలో ఒక ప్రక్కగా కూర్చుని ఉంటుంది. కొద్ది దూరంలో ఆలీ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ క్రింద కూర్చొని ఉంటాడు.]

ఆలీ— ...తప్పకుండా యిది కాకాజీకి ద్రోహమే నమ్మా !

భార—...ఎన్నటికీ కాదు.

ఆలీ—(తీవ్రంగా) ఎందుకు కాదమ్మా! అది అంతే! అయినా—
కాలికి దెబ్బ తగిలితే కంటికి నీళ్ళెందు కొస్తాయో చెప్పండి

భార—ఆ రెంటికీ అలాటి సంబంధం ఉంది. అదీ కాక దానికీ దీనికీ
పోలికేమిటి?

ఆలీ—ఇదీ అంతే నండమ్మా...! పైగా మీరు ఆ దొరను నమ్ము
తున్నారు. అది మరీ అన్యాయం.

భార—ఎలా ఔతుంది?

ఆలీ—చూడండి! మీరు నిన్న కాక మొన్న పుట్టారు. బడేసాబ్
కాచివడ పోశారు యీ దొరని; వారికి లేని నమ్మకం...

భారతి—ఓ—అదా! ఎవరినీ అందరూ సమంగా అర్థం చేసుకో
లేరు: నీకు తెలుసా! అదీ కాక, మంచివారిని అర్థం చేసు
కోవటం చాలా మందికి చేతకాదు.

ఆలీ—ఎంత వెఱ్ఱి దొరసాని వమ్మా! వట్టి 'నమ్మక్ హరామ్' నే
నమ్ముతున్నావు తల్లీ!

భార—పోనీ అలానే అనుకో. అయినా అటువంటివాళ్ళు కూడా
అందరికీ చెడుగు చెయ్యరు.

ఆలీ—(నవ్వి) అమ్మా — ఏమి టీ పిచ్చ అభిప్రాయం! మీతో
అనరాదు కాని. వాడు మీకు ఊరికే యే సహాయ
మన్నా చేస్తా డను కుంటున్నారా!

భార—ఎందుకు చెయ్యరాదు?

ఆలీ—అలా జరగ వద్దన్నా! ఎప్పుడూ జరిగేదే. వాడి స్వార్థం తీరే వరకూ—

భార—(చిరాకుగా) అంటే—?

ఆలీ—మీ కిప్పుడు తెలియదు తల్లీ! మీలాటి పెంగేపెంగే పాలు! అతడో మీబోటి వాళ్ళని...

భార—(తీవ్రంగా) ఆలీ! ఏమిటీ ధోరణి...?

(ఆలీ మాట్లాడకుండా తల పట్టుకుని కూర్చుంటాడు)

( తెర )

---

[అహమ్మద్ ప్రవేశం]

అహ—అర్ధరాత్రిపూట యిలా వచ్చానే...యెవరన్నా చూస్తే...? ఇలా ప్రవర్తించటం చేతనే కాబోలు ప్రపంచం నన్ను అనుమానించేది? అయినా...భయ్యాఁ ఊళ్ళో లేనప్పుడు...నేను...యింట్లో ఉండటం...(ఆగి...ఆలోచించి) వీల్లేదు. నే నెలా చెయ్యాను. (తిరిగి యోచించి)...కానీ...నే నిక్కడ తిరుగుతూ ఉంటే...చూచిన వాళ్ళు...(ఆగి)...ఏమైనాసరే .. యిక్కడే ఉంటాను. అదే నా ధర్మం. (తలుపు దగ్గరగా చెవిబెట్టి వింటాడు)...అంతా నిశ్శబ్దంగా ఉంది. వదినగారు పడుకుని ఉంటారు. అయినా ఆలీ ఉన్నాడో లేడో...!

ఆలీ—!

ఆలీ—(లోపలనుంచే) ...వకీల్ సాబ్... !

(తలుపు దగ్గరకు వస్తాడు. భారతికి ఆగ్రహం పట్టరానంతగా ఉంటుంది)

భార—అలీ...! ఏమిటది ?

అలీ—వకీల్ సాబ్ బచ్చాకే సూస్త్రా !

భార—అది తెలిసే తలుపు తీస్తున్నా వన్నమాట.

[అహమ్మద్ తలవంచుకుని ప్రక్కకు తొలుగుతాడు. అంతలో దూరాన్నుంచి ఎవరో చాలామంది పరిగెత్తుకు వస్తున్న అలజడి ఔతుంది. ఏవేవో కేకలుకూడా వినిపిస్తాయి]

వింటున్నావా ఆ అల్లరి! మీ రిద్దరూ కలిసి నా కొంప తీసేట్టున్నారు.

(మరీ దగ్గరగా కేకలు వినిపిస్తాయి)

అయ్యో దైవమా...! ఇప్పుడేం చేసేది...? జోసఫ్ చెప్పింది అక్షరాలా జరిగేట్టుందే!

అహ—(తిరిగి గడపనెక్కి ఆత్రుతతో) వదినా—! వదినా—!!

అలీ—!!

[అంతలో జోసఫ్ ప్రవేశిస్తాడు]

ఎవరది—?

జోసఫ్—(వికటంగా నవ్వుతూ) ఓ—మిష్టర్ అహమ్మద్—
గుడ్ నైట్ !

అహ— —జోసఫ్—!

[ఆ మాటలు విని భారతి అమాంతంగా తలుపు తీసి బయటకు వస్తుంది]

జోసఫ్—ఎస్. ఎస్. నేనే మిస్టర్ జోసఫ్‌ను. అంతగా గాభరా పడుతున్నా వెందుకు ?

భార—(కల్పించుకుని) పట్టుబడ్డామే అని గాబోలు !

జోసఫ్—(వెర్రిగా నవ్వుతూ) ఓ—అదా...! అయినా మిస్టర్

అహమ్మద్—! తమ రిక్షాడికి—యీ సమయంలో యేం
దుకు దయచేశారు? అదీకాక బ్రదర్ నా రాయల్ ఊళ్ళో
లేడని మీకు తెలుసుకుండా!

అహ—జోసఫ్—! (గద్దించాడు)

జోసఫ్—(విరగబడి నవ్వుతూ) ఓ—! ఇంతలో బోకరింపు
కూడానా—?

(ఆలీ తొందరగా ఓ కర్ర సంపుకుని బయట కురుకుతాడు)

ఆలీ—(జోసఫ్ నుద్దేశించి) కౌన్ హై ఓ—!—వకీల్ సాబ్—!
(అహమ్మదు ప్రక్కగా లాగుతాడు)

భార— —ఆలీ—!

జోసఫ్—(జేబులోని రివాల్వరును మెల్లగా లాగి అతనవంక గురిపెట్టి)
ఓ—యూ సిల్లీ డాగ్—!

(అంటూ కాలుస్తాడు. ఆలీ 'అల్లా' అంటూ పడి కొట్టు
కుంటూ ఉంటాడు. భారతి 'కెవ్వు' మంటుంది. జోసఫ్ భారతికి
దగ్గరగా జరిగి)

'డార్లింగ్—నో ఫియర్సు!!'

(కేకలు మరీ దగ్గరగా వస్తాయి. జోసఫ్ 'హుయీజ్
యిట్'' అని గద్దిస్తాడు. కేకలు ఆగిపోతాయి. విజయం పొందినట్లుగా
విరగబడి నవ్వుతాడు)

అహ—వదినా...! (ఉరుముతాడు)

జోసఫ్—(రివాల్వరు నాడిస్తూ) మిస్టర్ అహమ్మద్! నువ్వెంత
'బ్రెచరీ' తలపెట్టినా నీ మీదకు నా రివాల్వర్ రాదు
దానికి కారణం మనం 'బ్రదర్సు'గా మెలగటమే. చూడు...
కాకాజీ 'డెత్ బెడ్' మీద ఉన్న యీ సమయంలో నువ్వు
యిలా 'బ్రూట్' లాగా 'యాక్టు' చేయటం యేమంత

బాగుంది ? పో—! 'మార్నింగ్ ట్రెయిన్' కి వెళ్ళి, ఆయన యింకా బ్రతికిన్నంటే యీ దోషాన్ని 'యాజిటేజ్' ఆయనకు చెప్పు. 'అపాలజీ' కోసం. తెలిసిందా...!

[అహమ్మద్ చకితుడౌతాడు— పోలీసులు ఈలలు వేసు కుంటూ అడే వస్తున్న చప్పుడౌతుంది. కవిమందిజనం పరుగెత్తుకు వస్తున్నారు. జోసెఫ్ గాభరా పడతాడు; రివాల్వర్ యెలా దాచాలా అని. అటూ యిటూ చూస్తాడు పారిపోవటానికి; కాని కదలడు]

ఓ...మై గుడ్ నెస్!' విజిలుండా పిస్తోలుమోత విని వాళ్లే వస్తున్నారే! ఆఁ...! మిస్టర్ అహమ్మద్! నువ్వు వెంటనే పారిపోటం మంచిది! నీ మంచికోరి చెబుతున్నాను. ఏం...? వెళ్ళవా...?

[పోలీసులు ప్రవేశిస్తారు]

జోసఫ్—ఆఁ—! యూ—కానిస్టేబుల్! ఇదుగో—(అహమ్మద్ వంక చూపుతూ టార్చి వేస్తాడు. తరువాత అలీ ఉన్న దిక్కుగా చూపుతాడు. రివాల్వరును వారి కందిస్తాడు)

పోలీ—(అహమ్మద్ చేతిని పట్టుకొని, ముఖంచూసి) ఓ—! వకీల్ సాబ్—!

(చేతిని వదులుతారు. అహమ్మద్ వెలవెల బోతూ వారివంక చూస్తాడు. భారతి యేమీ అనలేక బొమ్మలా నిలబడి పోతుంది. హుస్సేన్ తప్పత్రాగి ప్రవేశిస్తాడు; చేతిలో మంచి దుడ్డుకఱ్ఱ వుంటుంది. ఏదో పాడుతూ ఉంటాడు. ఆ గొంతును గుర్తించి జోసఫ్ కలవర పడతాడు.)

హుస్సేన్—(జోసఫ్‌ను పట్టుకుని) క్యా బే—ఉల్లూ! రాండీ యింటికే కాడా రాజూలాగా తిర్గూ తుండావ్!

జోసఫ్—నాట్—యూ—ఫూల్—?

1 పోలీ—అరె ఉల్లూ కా బచ్చే—(హుస్సేన్‌ను పట్టుకుంటాడు)

హుస్సేన్—తుం హై కౌన్...?

2 పోలీ—తూ కౌన్ హైరె రాజా...! (నవ్వుతాడు)
హుస్సేన్—హైఁ...! హైఁ...! అరే...నా కీహోన్ ? నాకీ పేరూ
సెప్తే నాల్గూ లోకాల్ హడ్డీ సస్తాయ్! పేరూ సెప్పాడానీకి-
నాకీ హుకుమ్ లేదు రే బా...!
(పోలీసులు చాచి ఒక చెంపదెబ్బ కొడతాడు. దాంతో వాడు
'అరే అల్లా' అంటూ మూలుగుతాడు.)
1 పోలీ—చెప్పూ బే—జల్దీ !
హుస్సేన్—ఆఁ—ఆఁ—ఆఁ— పేరూ జోసఫ్ సేట్ జీ...!
(రోదిస్తాడు)
జోసఫ్—(వికటంగా నవ్వుతూ) యూ—కాన్స్టెబుల్—! (అరెస్టు
చెయ్యి మన్నట్లుగా సైగ చేస్తాడు)
1 పోలీ—మీరు కూడా స్టేషన్ కు రావాలి సార్ !
జోసఫ్—ఓఁ—ఆల్ రైట్—! అయినా—నేను దేనికి ?
2 పోలీ—ఐడెంటిటీ కోసం సర్ !
జోసఫ్—సరే—! మీరు పదండి—నేను వస్తాను.
1 పోలీ—అలా కాదు సార్—!
జోసఫ్—(విసుక్కుంటూ) డెన్—కమాన్ ! ఆలోచించి) కానీ—
'తేడీ' ఒక్క ర్తె ఉండలేదే !
2 పోలీ—మిమ్మల్నిప్పుడే పంపుతాం సార్ !
జోసఫ్—ఓ—థ్యాంక్యూ—థ్యాంక్యూ—? (సిగరెట్టు నందిస్తూ)
ఇఫ్ యూ డోంట్ మైండ్—!
[పోలీసులు సిగరెట్లు తీసుకున్నారు. జోసఫ్ నిప్పు వెలిగించి
వారి కందిస్తాడు. జనసమూహం మధ్య ఆహ్వానిస్తుంటాడు. అతనికి
రెండువైపులా పోలీసు లున్నారు. జోసఫ్ ముందుగా నడుస్తూ
ఉంటాడు. భారతి లోపలకు వెళ్ళి తలుపులు వేసు కుంటుంది.]
( తెర )

# ఆరో రంగ

[స్థలం—నారాయణ యింటివాకిలి. తలుపులు మూసి వుంటాయి. నారాయణా రహీమ్‌లు ప్రవేశిస్తారు. నారాయణ ఖిన్నవదనుడై వుంటాడు. రహీమ్ గంభీరంగా యేదో ఆలోచిస్తూ వుంటాడు]

రహీమ్—బేటా...నారాయణ్!

నారా—ఏమిటి కాకా—!

రహీమ్—నన్నిందుకు ఇలా తీసుకువచ్చావు బేటా! నా రామాభయ్యాతోపాటు నన్నుకూడా ఆ మట్టిలోనే యెందుకు కలపలేదు! రామాభయ్యా యెంతటి అదృష్టవంతుడు! దిగులూ చింతా లేకుండా—తన ఆశయం ఫలిస్తుందనే ఆశతో—పుట్టి పెరిగిన మట్టిలో—యెంత హాయిగా నిద్రపోతున్నాడు! నువ్వు కల్పించిన అనుమానం నా గుండెల్లో కత్తిలా పని చేస్తోంది. బేటా! నా ప్రేమమూర్తి నన్నే పాపైకరుస్తోంది నారాయణ్! —అల్లా—! నన్నిలా రప్పించి నా హృదయాన్నెందుకు రంపపుకోత కోస్తున్నావు? (కళ్ళు మూసుకుని) రామాభయ్యా! నా అహమ్మద్ నీ నారాణ్‌కు చేసిన అపచారానికి నే నిక్కడే ప్రాయశ్చిత్తం అనుభవిస్తున్నాను. తెలియక విషవృక్షాన్ని పెంచటంలో నీక్కూడా భాగం ఉంది కదూ—! విచారపడకు—!! నీ బంధుగులు కూడా ఆ పాపాన్ని నేనే పంచుకుంటాను. శాంతంగా—నిర్విచారంగా—ఈ లోకాన్నే మరచి—ఆనందంతో అల్లా బిడ్డలతో ఆడుకో భయ్యా! నేనూ యిక యెంతో కాలం—యీ నరకంలో ఉండలేను. (కన్నీ రద్దుకుంటూ వుంటాడు)

నారా—...కాకా...!

రహీమ్—హాం...బేటా...!

నారా—...ఇక...యిక్కడనించబడి లాభమేముంది...?

రహీమ్—నా "రాణీ" యిక...నాకు కనిపించదా బేటా—! నా అహమ్మద్‌ను నేను శిక్షించుకోలేనా! వానికి అల్లా శాపుల్లో పడాల్సిందేనా...! రాణీ...! నీ విశ్వాసం అంతా ఆ సైతాన్ మందు...లో కలిసి పోయిందమ్మా! నారాయణ్ బేటా నిలా బాధించాలని నీకేలా తోచిందమ్మా! చాచాజీ; అంటూ ఇక యెలా నా యెదుట పడగలవమ్మా రాణీ...!

[ఒక ముస్లిం విద్యార్థి అటువైపే పోతూ ఆగి వారిని చేర్తాడు]

ము. వి—ఉస్తాద్ !

నారా—(అతనివంక చూసి) ఆఁ...! అజీజ్...!

ము. వి—తమరు...కోర్టుకు రారా...?

రహీమ్—ఎందుకు బేటా...!

ము. వి—వకీల్‌సాబ్ దావా విచారణ జరుగుతోంది దాదా !

(రహీమ్ తల వాల్చుకుంటాడు)

నారా—(చకితుడై)...నేరం...?

ము. వి—అలీని కాల్చారని!

రహీమ్—అరె...అల్లా...! (నిశ్చేష్టుడై పోతాడు)

నారా—(గంభీరంగా) ఎవరన్నారు...?

ము. వి—తమ బీబీ సాక్ష్యం యిస్తోంది ఉస్తాద్...!

(నారాయణ తన్ను తానే నమ్మలేక పోతాడు)

రహీమ్—(ఆశ్చర్యంతో) ఆఁ...ఆఁ...! నా రాణీయే?

ము. వి—జోసఫ్‌సాబ్ ఆమెను యిప్పుడే తీసుకువెళ్ళారు దాదా !

రహీమ్—అం... ! (చకితుడై చూస్తూ)

నారా—(గంభీరంగా) అజీజ్...! ఏం తప్పైంది?

ము. వి—గంట దాటింది ఉస్తాద్!

నారా—(గడియారం చూసుకుని) హాఁ హాఁ...' (పట్టుకుని నడిపించి తీసుకుపోతూ ఉంటాడు)

(తెర)

---

(రహీం వారింట్లో నారాయణ్, రహీమ్‌లు)

రహీమ్—బేటా...! మనం...యిప్పుడే ప్రపంచంలో ఉన్నాం...?

నారా—నాకూ తెలియటం లేదు చాచా!

[అలీ ప్రవేశిస్తాడు. వారినిజూచి పరుగెత్తుకు పోయి కౌగలించుకుంటాడు.]

రహీమ్—(ఆనందంతో) అలీ...! (అతడి వీపును నిమురుతాడు)

అలీ—(నారాయణతో) జనాబ్...!

నారా—(నెమ్మదిగా)...అ...లీ! ఎక్కడనుంచి వస్తున్నావు?

అలీ—దవాఖానా నుంచి; ఉస్తాద్!

నారా—ఆరోగ్యం...?

అలీ—జోసఫ్ దగ్గర లంచం తిని సర్జన్ నన్ను వదల్లేదు ఉస్తాద్. వాడి కంట్లోనే కారం చల్లి వస్తున్నాను. అయినా నా ఆరోగ్యానికేం ఉస్తాద్...ముందు...

రహీమ్—ఎక్కడికి పోతున్నావు భయ్యాఁ!

అలీ—మనింటికే బడేసాబ్! ఈ రోజున విచారణ ఉంది కదూ!

నారా—...ఉంటే...?

ఆలీ—అదేమిటి ఉస్తాద్! అమ్మగార్ని తీసుకుపోవాలా లేదా?
రహీమ్—...ఎక్కడికి...?
ఆలీ—సవాయి ఉండాలుగా బడేసాబ్! కోర్టుకు పోతే యింకా రాలేదన్నారు...! అందుకని—
రహీమ్—(ఆశ్చర్యంతో) అక్కడ జోసఫ్ లేన్నాడా—!
ఆలీ—(కోపంతో) ఆ—! ఉన్నాడుసాబ్; సైతాన్!
రహీ—ఊం!

[నలుగురు విద్యార్థులు భారతితో ప్రవేశిస్తారు]

ఎవరా వచ్చేది—?—మా రాణీ కదూ—!!

(భారతి చూసి "చాచాజీ" అంటూ కౌగిలించుకుంటుంది. కన్నీరు కారుస్తూ రహీమ్ ఆమె శిరస్సును నిమురుతూ ఉంటాడు. నారాయణ్ నిర్విణ్ణుడై నిలబడతాడు. ఆలీ "అమ్మా" అంటూ ఆమెను పలుకరిస్తాడు)

భార—ఆ—లీ!
విద్యార్థులు—గుడ్ మార్నింగ్ సార్—!
నారా—ఎక్కడనుంచి వస్తున్నారు—?
1. విద్యార్థి—అమ్మగార్ని విడిపించుకు వస్తున్నాంసార్
నారా—అంటే—?
2. విద్యార్థి—జోసఫ్ అమ్మగార్ని ఓ గదిలో పెట్టి తాళం వేసి వెళ్ళాడు సార్. అమ్మగారి కేకలు విని మేం పోయి...తాళం పగలకొట్టి—
రహీమ్—ఆం—!
2. విద్యార్థి—ఔను సార్—! క్షేమంగా యింటికి చేరుద్దామని—
భార—(ఆవేశంతో)—రాజా—! (అతడిని చేరుతుంది)

3. విద్యార్థి—అన్ని గార్ని చాలా కష్టపెట్టాడు సార్ ఆ స్కౌండ్రల్—!

4. విద్యా—నిష్కారణంగా వకీల్‌సాబ్‌ను అరెస్టు చేయించాడు; "రాగ్స్"

నారా—(భారతితో)—రాణీ—!

భారతి—రాజా—?

నారా—ఏమంటే అల్లరి...?

[భారతి మాట్లాడ లేదు]

రహీమ్—నారాయణ్ బేటా...! రాణీని గాభరా పెట్టకు! మన అదృష్టవశాత్తు రాణీ తిరిగి మనకు లభించింది; సంతోషించు!

1 విద్యార్థి—మీరు నెమ్మదిగా వస్తూండండి సార్...మేం ముందుగా...

[నిష్క్రమిస్తారు]

నారా—కాకా...!

రహీమ్—బేటా...!విచారపడకు! !

(అలీతో)...అలీభయ్యా! ఏమిటిది...?

అలీ—ఇదంతా ఆ నమ్మక్‌హరాం చేసిన పనే; బడే సాబ్!

రహీమ్;—అంటే...?

అలీ—నేను చెప్పినా లాభంలేదు బడేసాబ్...అదంతా మీరే అర్థం చేసుకోవాలి, పదండి కోర్టుకు పోదాం!

[తెర యెత్తగానే కోర్టు కనిపిస్తుంది. బోనులో అహమ్మద్ తల వాల్చుకుని నిలబడి ఉంటాడు. ఇరువంకలా పోలీసు లుంటారు, ఒక కుర్చీలో జోసఫ్ సిగరెట్ పీలుస్తూ అహమ్మద్ వంక వికటంగా చూస్తూ ఉంటాడు, ఒక వకీల్ అహమ్మదును పరీక్షిస్తూ ఉంటాడు.]

వకీల్—అయితే, మీకూ సాక్షి ఆ భారతీదేవేనంటారు.

అహ—ఔను. బ్రతికి ఉంటే 'ఆలీ' కూడా.

జోసఫ్—(లేచి) యువర్ ఆనర్! ఆలీ చాలా సీరియస్ స్టేట్‌లో ఉన్నాడనీ...మరో గంటకో రెండు గంటలకో 'కొలాప్సు' అవుతాడనీ డి. యమ్. ఓ. వ్రాసి పంపాడు. (ఒక కాగితాన్ని వకీల్ ద్వారా జడ్జికి అందిస్తాడు)

జడ్జీ—మరి...భారతీదేవి యింకా రాలేదు!

జోసఫ్—యువర్ ఆనర్, ముద్దాయి 'ఫాలోయర్స్' అంటే గూండాలే ఆవిడను కూడా...

అహ—ఆఁ...! (నిర్ఘాంతపోతాడు)

[విద్యార్థులు దూరంగా నిలబడి నవ్వుకుంటూ వుంటారు. ఒక కాగితాన్ని మరొక వకీల్ ద్వారా జడ్జి వద్దకు పంపుతారు.]

జోసఫ్—షట్ అప్...యూ ట్రెచరస్ మర్డరర్!!

జడ్జి—(విద్యార్థులు పంపిన కాగితాన్ని చూస్తూనే, గంట కొట్టి) మిష్టర్...జోసఫ్...! డోన్టు మేక్ దిస్ యె ఫిష్ మార్కెట్!

జోసఫ్—ఓ...! ఎక్స్‌క్యూజ్ మీ యువర్ ఆనర్!

జడ్జి—ఏ సరీ 'నోట్' పంపింది?

1. వకీలు—'సమ్ స్టూడెంట్సు; యువర్ లార్డుషిప్!'

విద్యార్థులు—(ముందుకు వచ్చి) మేమేనండి.

[జోసఫ్ వారి వాళ వెఱ్ఱిగా చూస్తాడు. అహమ్మద్ ఆనందంతో వీక్షిస్తాడు.]

జడ్జి—అయితే భారతీదేవి యిక్కడకు వస్తున్నారా!

విద్యార్థులు—ఎస్ యువర్ లార్డుషిప్!

జోసఫ్—(కలవరపడి) యువర్ ఆనర్! దిస్ ఈజ్ ఆల్ సిల్లీ! ఆవిడ ఫస్ట్ అవర్ నుంచీ కనబడటం లేదు. వీళ్ళ కసలే కనబడదు. అదీ కాక వచ్చినా ముద్దాయికి 'యుగనెష్టు'గానే చెబుతుంది...సార్!

జడ్జి—కీప్ క్వయట్ ప్లీజ్! (విద్యార్థులతో) అయితే సరే...రానీయండి! (విద్యార్థులు వెనక్కు వెడతారు)

[క్రౌను వకీలు నుద్దేశించి]

యూ కెన్ ప్రొసీడ్.

క్రౌన్ వకీల్—(ఒక కాగితాన్ని చూపిస్తూ) దీనిక్రింద ఉన్నది మీ పేరే కదూ!

అహ—ఔను.

క్రౌన్ వకీల్—ఇది మీరే అచ్చువేయించారు కదూ!

అహ— లేదు.

జోసఫ్—సింప్లీ ట్రెచరస్

క్రా. వ—(ఒక ముస్లింసేట్ అందించిన కాగి తాన్ని చూసి) ఓ—
వండర్ ఫుల్—! (జడ్జికందిస్తాడు.)

జడ్జి—(చదువుకుని, జోసఫ్ వంక ఓరగా చూస్తూ) మిస్టర్ జోసఫ్!

జోసఫ్—(లేచి) యువర్ ఆనర్—(కలవరపడి బయటకు వెళ్ళ బోతూ ఉంటాడు)

[జడ్జి పోలీసుల నుద్దేశించి అతడ్ని జాగ్రత్తపరచ మన్నట్లు చూస్తాడు; పోలీసు లతడ్ని చేరి బయటకు పోకుండా అటకాయిస్తారు జోసఫ్ కలవరపడి పోతూ ఉంటాడు.]

జడ్జి—(ముస్లిం సేట్ నుద్దేశించి) అయితే—వీటిని ప్రింటు వేయించింది వకీల్ అహమ్మద్ కాదంటారు...కానా—!

ము. సే—ఎస్ యువర్ ఆనర్!

జడ్జి—యిది లా అండ్ ఆర్డర్‌కు భంగమని మీకు తెలుసు?

ము. సే—ఎస్ యువర్ ఆనర్!

జడ్జి—మరి యెలా ప్రింట్ చేశారు?

ము. సే—అది వర్కర్సు చేసిన మిస్టేక్ యువర్ ఆనర్! నా నోటీస్ లోకి రాగానే పోలీస్ రిపోర్టు యిచ్చుకున్నాను.

సర్కిల్ ఇనస్పెక్టర్—యస్, యువర్ లార్డుషిప్. వారం క్రితమే అది 'ఫైల్' అయి ఉంది.

జడ్జి—యాక్షన్ తీసుకున్నారా!

స. ఇ—ఇన్వెస్టిగేషన్ జరుగుతోంది; యువర్ ఆనర్! రిపోర్టులో ఎవరిచ్చింది కన్ఫెషన్ చేయలేదు.

జడ్జి—...మరి...! ఆ వర్కర్సు యిక్కడున్నారా!

ము. నే—యస్, యువర్ ఆనర్. అక్కడ తీసుకున్న క్లార్కు యిప్పుడే ఊరేగింపుగా వచ్చారు.

జడ్జి—అయితే యిక్కడున్న వారిలోంచి ఆర్డరిచ్చిన అతన్ని ఐడెంటిఫై చేయమనండి!

[ఒక గుమాస్తా ముందుకు వచ్చి కోర్టుకు సలాం చేసి...నలు వంకలా పరీక్షించి చూసి జోసఫ్ వైపు నిదానించి చూస్తూ ఉంటాడు. జడ్జి జోసఫ్ వంక చూస్తూ 'ఓ...సింప్లీ ట్రెచరస్' అని హేళన చేస్తాడు.]

గుమాస్తా— ...వీరే సార్ !

జోసఫ్—నో...నో—సింప్లీ ట్రెచరస్—!! (బయటకు వెళ్ళబోతూ ఉంటాడు. నారాయణా రహీమ్, భారతీ ఆలీ ప్రవేశిస్తారు. వారిని చూసి, ఆ.?, ఏమి చేయడానికీ తోచక వెనక్కు తిరిగి, తలవంచుకుంటాడు. అలీ గబ గబా అతడి మీదకు ఉరుకుతాడు; పోలీసులు అడ్డుపడతారు.)

[నారాయణ తలవాల్చుకుని అలాగే నిలబడతాడు. భారతి అతని ప్రక్కగా నుంచుంటుంది, రహీమ్‌కు సాయంగా.]

అహా—(ఆటుగా చూసి)—అబ్బా—! (తండ్రి వైపు చేతులు చాస్తాడు.)

రహీమ్—— ——బేటా——!

క్రౌ—వ——యువర్ ఆనర్ · ఆలీ భారతీదేవి కూడా వచ్చారు.

జడ్జి——ఆలీని బో నెక్కించండి ! (ఆలీ బోనులో వుంటాడు)

క్రౌ. వ——నిన్ను కాల్చింది వకీల్ అహమ్మద్ అని నేరం మోపబడ్డది. నువ్వేం చెబుతావు?

ఆలీ——అంతా అబద్ధం జనాబ్ ! నన్ను కాల్చింది యీ సైతాన్. (జోసఫ్ వంక చూపుతాడు.)

స. ఇ——రివాల్వర్ గుండు కూడా అదే ప్రూవ్ చేస్తోంది; యువర్ ఆనర్ !

జోసఫ్——సింప్లీ క్రెచురస్. నా చేతులోంచి లాక్కుని ముద్దాయీ కాల్చాడని నేను మొకట్లోనే రికార్డు చేయించాను. (చిటపట లాడతాడు)

జడ్జి——ఓ...సింప్లీ క్రెచురస్! (నవ్వుతాడు)

క్రౌ. వ——భారతీదేవి మిగిలింది సార్! ఆమె క్రౌన్ తరఫున సాక్షి.

(భారతివంక జడ్జిచూస్తాడు. ఆమెబోనులో కొనొస్తుంది)

జోసఫ్——(ఆమెవంకచూస్తూ) ఓ...యూ డెవిల్...!

(జడ్జి చురచురా జోసఫ్‌వంకచూస్తాడు)

క్రౌ. వ——అమ్మా! మిస్టర్ అహమ్మద్ ఆలీని కాల్చాడు కదూ...

భార——లేదు.

•విద్యార్థులు—ఇప్పు డీవిడ యెక్కడనుంచి వచ్చారో అడగండి!

క్రౌ. వ——(విద్యార్థులతో) సైలెన్సు ప్లీజ్ !

(భారతితో) అమ్మా! మా రాముపురం కాల్చేస్తుంటాడు!

భార—(జోసఫ్‌వంక చూస్తూ)...అతడు

జోసఫ్—ఓ...సింప్లీ టెరిబుల్!

క్రా. వ—అహమ్మద్‌ను మీరు ఎరుగుదురా!

భార—ఆ! బాగా...!

జోసఫ్—షేమ్‌లెస్ గూస్!

జడ్జీ—మిస్టర్—జోసఫ్ (గద్దిస్తాడు)

క్రా. వ—మరి—జోసఫ్ ఎరుగుదురా...!

భార—ఇప్పు డిప్పుడే అర్థ మౌతుంది అతడి విషయం.

క్రా. వ—అంటే...?

భార—మా గృహకల్లోలాని కితడే మూలం. అన్న తమ్ములమధ్య కయ్యాలు కల్పించాడు. నన్నవమానపరచాలని యెంతగానో యత్నించాడు. మా ప్రాణంవంటి ఆలీని చంపాలని చూశాడు. చివరకు ఆ కోపాన్ని నా మరదిగారి మీదకు త్రోశాడు. కోర్టుకు వెళ్ళాలి రమ్మని బండీలో తీసుకెళ్ళి నన్ను ఒకమూల చీకటి కొట్లో బంధించి — చెంప దెబ్బతిని...

(జోసఫ్ బుగ్గ తడుముకుంటాడు. హాలు పకపకలతో నిండిపోతుంది.)

కావాలంటే నా ఐదు వేళ్ళూ ఆ బుగ్గమీద చూడవచ్చు...!

జడ్జీ—ఇట్ యీజ్ ఇనఫ్! మిష్టర్ అహమ్మద్...! మిస్టర్ జోసఫ్ కోసం మీరా స్థానాన్ని వెకేట్ చేయాలి, ఇటు రండి—! (అని కుర్చీని చూపుతాడు)

(హర్షధ్వానాలు. పోలీసులు జోసఫ్‌ను పట్టుకొని అందులోకి తీసుకుపోతారు. నారాయణా రహీమ్ లు ఒక్క ఉదుటున బోను వద్దకు వెడతారు. అహమ్మద్ ఉరుకుతూ వచ్చి "భయ్యా!" అంటూ నారాయణ్‌ను కౌగిలించుకుంటాడు. ప్రక్కనే అరదండా లతో ఉన్న రౌడీ జోసఫ్‌ను చూస్తూ "నాకీ హిల్లా పసీనంద్కీ నీకీ హాన్సాబవించూ!" అంటాడు.]

జడ్జి—ఓ—మిస్టర్—జోసఫ్—ఇట్ యీజ్ టెరిబుల్ —!!

(హర్షధ్వానాలు)

సమాప్తం.

# ఆంధ్ర నాటకములు

| | రు | అ |
|---|---|---|
| **బళ్ళారి ధర్మవరం గోపాలాచార్యులుగారి** | | |
| రామదాసు | 1 | 8 |
| **బళ్ళారి క. బాలసరస్వతిగారి** | | |
| భక్తతుకారామ్ | 1 | 8 |
| **గురజాడ అప్పారావుగారి** | | |
| కన్యాశుల్కము | 2 | 0 |
| **బళ్ళారి పండిత క. సుబ్రహ్మణ్యంగారి** | | |
| కృష్ణలీల | 1 | 8 |
| లవకుశ | 1 | 8 |
| భక్తకుచేల | 1 | 8 |
| మేవాడు శౌర్యాగ్ని (చరిత్రాత్మక నాటకము) | 1 | 8 |
| విభీషణ పట్టాభిషేకము అను లంకాదహనము | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 |
| మిహిర (పద్మిని) | 1 | 8 |
| **ముత్తనేని వెంకట చెన్నకేశవులుగారి** | | |
| తులసీదేవి (సతీతులసి) | 1 | 8 |
| **చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి** | | |
| గయోపాఖ్యానము | 1 | 12 |
| ప్రసన్నయాదవము | 1 | 8 |
| పారిజాతాపహరణము | 1 | 8 |
| **చందాల కేశవదాసుగారి** | | |
| కనకతార | 1 | 8 |
| **విద్వత్కవి మల్లాది అచ్యుతరామశాస్త్రిగారి** | | |
| సక్కుబాయి(అసలుస్టేజినాటకం) | 1 | 8 |
| **శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారి** | | |
| సావిత్రి | 1 | 8 |

| | రు |
|---|---|
| **కీ. శే. కాళ్లకూరి నారాయణరావుగా** | |
| వరవిక్రయము | 1 |
| పద్మవ్యూహము | 1 |
| చిత్రాభ్యుదయం (సారంగధర) | 1 |
| **బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారి** | |
| సత్యహరిశ్చంద్రీయము | 1 |
| **మానాపురం అప్పారావు పట్నాయక్ గారి** | |
| రేవతి | 1 |
| **శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి** | |
| బొబ్బిలియుద్ధము | 1 |
| **విష్ణుభట్ల సుబ్రహ్మణ్యంగారి** | |
| సారంగధర | 1 |
| **కాజ రాధాకృష్ణశాస్త్రిగారి** | |
| జన్మభూమి | 1 |
| అమరజ్యోతి | 1 |
| మాధవశర్మ | 1 |
| ఝాన్సీరాణి | 1 |
| **వేదాంత కవిగారి** | |
| తెనుగుతల్లి | 1 |
| ఆకలిమంట | 1 |
| కష్టకాలము | 1 |
| మహారథి కర్ణ | 1 |
| విశ్వస్వరాజ్యం | 1 |
| **ఊటుకూరు సత్యనారాయణరావుగా** | |
| వీరాభిమన్యు | 1 |
| అనార్కలీ | 1 |
| ఛత్రపతి శివాజీ | 1 |
| అహల్య | 1 |
| ద్రౌపది వస్త్రాపహరణము | 1 |